











పద్మశ్రీ పిక్చర్స్

# అందరూ బాగుండాలి

VEEKAY

దర్శకత్వం **పి.పుల్లయ్య** నిర్మాత **వి.వెంకటేశ్వర్లు**

మాటలు గొల్లపూడి పాటలు ఆచార్య ఆత్రేయ దాశరథి సంగీతం మాస్టర్ వేణు

arpana కెమెరా ఎస్ ఎస్ లాల్ కళ ఎస్.కృష్ణారావు కూర్పు శంకర్ స్టూడియో సారథి శ్రీ ఫిలింస్

# సన్‌సార్

ఇది
కుటుంబమునకు
స్నానపు సబ్బు

మైసూర్
స్యాండల్ సోప్
తయారుచేయువారినుంచి








100 గ్రాం.
స్నానపు
సబ్బు బిళ్ళకు
95 పైసలు మాత్రం
పన్నులు ప్రత్యేకం.

MCA/SAN/1

తయారుచేయువారు: గవర్నమెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు  సోల్ సెల్లింగ్ ఏజెంట్లు: మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు













**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938–1972]

శుక్రవారం 6–2–'76
రాక్షసనామ సం మాఘ శు షష్ఠి
*సంపుటము . 69 సంచిక : 22*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

★

సంవత్సరచందా – రు 33–80
ఆరుమాసాల చందా – రు 16–90
విడి ప్రతి వెల 60 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ
నటి జయసుధ
(ఫొటో శ్రీ ఎస్ ఆర్ డి. మూర్తి)

# ఇప్పుడు! చురుకైన జీవనంకోసం శక్తినిచ్చే 'యింధనాన్ని' సేవించండి.




# బూస్ట్

## మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

మీ కార్యక్రమాన్ని ప్రతిరోజూ ఉత్సాహంగా ప్రారంభించడంకోసం మీకుకూడా. రైలుమాదిరిగా యింధనం కావాలి శక్తినిచ్చే యింధనం మిమ్మల్ని రోజల్లా చురుకుగా వుంచి చకచకా పనులు చేసుకునేట్లట్లు చేస్తుంది అందుచేతనే మీకు ప్రతి ఉదయం బూస్ట్ కావాలి ముఖ్యంగా మీ పిల్లలు పనిలోనూ, ఆటల్లోనూ అదనపు శక్తిని వినియోగిస్తారు వారికి బూస్ట్ యివ్వండి ఇది కొత్త మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు పౌష్టికాహారం గురించి సంపూర్ణంగా తెలిసిన 'హార్లిక్స్' వారు తయారు చేసినది

సహజంగా లభించే ఆహారంతోనూ, విటమిన్లతోనూ, ఖనిజాలతోనూ బూస్ట్ తయారు చేసారు. దీనిలో పూర్తి మీగడపాలు, గోధుమ బార్లీ మాల్టు మరియు కోకో పదార్థాలు సమృద్ధిగా మీగడతో కూడిన మాల్ట్ చాకొలెట్ రుచి దీనికి వుంది. మీ కుటుంబమంతా యిష్టపడుతుంది. బూస్ట్ మీ రోజుని ప్రారంభించేందుకు ఓక అద్భుతమైన మార్గం—ప్రతిరోజూ.

రెండు సైజులలో లభిస్తుంది.

## 'హార్లిక్స్' ఉత్పత్తిదారులనుంచి.

---

ఆంధ్రప్రదేశ్ మరియు కేరళలో మాత్రం లభించును.

పెళ్లివారింట్లో ఆఖరి బంతి భోజనాలు జరుగుతున్నాయి. కుముద, చంద్రకాంత, శశికళ, పెళ్లికూతురు తల్లికి చెప్పివెళ్లాలని, ఆవిడకోసం వెతుక్కుంటూ ఓ గదిలో ఆవిడ మరో పెద్ద ముత్తయిదువతో మాట్లాడుతూ ఉండటం కన్పించి అటు వెళ్లారు




' ఆవిడ పిల్లని చూడలేదు అటు తిరిగి రెండో ఆవిడలో

"ఇదేం మనుషులో వదినా! గట్టిగా దేనికీ పేచీ పెట్టటం లేదన్న మాటేగాని దేనికో ఒకదానికి సాధిస్తూనే ఉన్నారు ఏమీ అర్థంకావటంలేదు తెల్లవారుఝాము ముహూర్తం పిల్లలు రాత్రి నిద్రలేకుండా ఉన్నారు, మళ్లీ మూడు నిద్రలకి ఎలాగా వస్తారుగదా! వేడుకలు అప్పుడు జరుపవచ్చు నంటే విన్పించుకోవడంలేదు వాళ్లమాటే చెల్లాలి. అన్నీ ఇవాళే అంటున్నారు" అంటుంటే అప్పుడే అక్కడికి వచ్చిన ముగ్గురూ, ఆ మాటలు విని కాస్త సిగ్గు

# వన్నెల కన్నెలు

## డి. విద్యేశ్వరి

పడ్డారు ఆవిడని పిలవాలా వద్దా అని సందేహించారు అంతలో ఆ రెండో ఆవిడ ఇటు చూసి

''రండమ్మా ఏం కావాలి'' అని అడిగింది.

పెళ్లికూతురు స్నేహితులుగా అక్కడందరికీ ముందురోజు రాత్రి నుంచీ వీళ్లు ముగ్గురూ పరిచయం అయారు.

కుముదే ముందు మాట్లాడింది.

''మేం వెళ్లివస్తామండీ, పిన్నిగారికి చెప్పి అని వచ్చాం.'' అప్పటికి పెళ్లికూతురు తల్లి ఇటు తిరిగి.

''ఏమ్మా భోజనాలు చేశారా, మీకు ఎవరేం పెట్టారో, ఏం చూశారోకూడా నేను చూడ లేదు'' అన్నారు.

''ఇంత పనిలో ఉండికూడా మాకు చూడాలాండి, అయినా మేమేం కొత్తవాళ్లమా! మా జ్యోత్స్న పెళ్లిలో మాకు మొహమాటం ఏమిటండీ ?''

మళ్లీ కుముదే ఆవిడకి సమాధానం చెప్పి వెళ్లివస్తామని మరోసారి చెప్పింది.

''ఉండమ్మా బొట్టు పెడతాను'' అని జ్యోత్స్న అమ్మగారు లేవగానే రెండో ఆవిడ.

''సాయంత్రం అప్పగింతలు అయేదాకా ఉండి మీ జ్యోత్స్నని పూర్తిగా వాళ్లకి అప్పగించి, భోజనాలు చేసి వెళ్లండర్రా పిల్లలూ'' అంది కాస్త అధికారం, కాస్త హాస్యం అన్నీ కలిపి.

''కాదండీ చీకటిపడిపోతే మేం వెళ్లాలంటే కష్టం'' అని ముగ్గురూ ఆవిడకి సమాధానం చెప్పి, జ్యోత్స్న వాళ్ల అమ్మగారి చేత బొట్టు పెట్టించుకుని తాంబూలం పుచ్చుకున్నారు

''జ్యోత్స్నకి చెప్పారామ్మా'' ఆ విడ ప్రశ్నకి '' చెప్పామని '' సమాధానం చెప్పి బయటకు వచ్చారు గదిలోనించి. వెనక నించి ంకా మాటలు వినిపిస్తున్నాయి

''రేపు పొద్దున్న వెడతామని అంటున్నారు. ొద్దున్నంటే భోజనాలు చేశా, చెయ్యకుండానా అన్నది ఇంకా తెలియలేదు వాళ్ల పద్ధతి ''

బయటకువచ్చి కనపడ్డవాళ్లకి చెప్పేసి ముగ్గురూ రోడ్డుమీదికి వచ్చారు.

కొంచెంసేపు ఎవరూ మాట్లాడలేదు. ఎవరి ఆలోచనలలో వాళ్లు మునిగి నడుస్తూ ఉంటే ముందు చంద్రకాంతే, ''జోత్స్న చాలా బావుంది కదూ పెళ్లికూతురుగా అతను కూడా చాలా చక్కటివాడు పేరుకి తగ్గట్టు మురళీకృష్ణుడిలాగే ఉన్నాడు'' అంది.

మిగిలిన ఇద్దరూ ఆ మాట ఒప్పుకున్నారు. నిజమే. వాళ్లు నలుగురిలో అందగత్తె జ్యోత్స్న. పచ్చగా బంగారంలా మెరిసే ఛాయ. పెద్ద కళ్లు ఆ కళ్లు ఎప్పుడూ భయం బెరుకుతో వుంటాయి నల్లగా, పొడుగ్గా తుమ్మెద రెక్కల్లాంటి తలకట్టుతో కొద్దిగా పొడుగ్గా ఉండి, ఆ పొడుక్కి తగినట్టు కొద్దిగా ఒళ్లుంటే ఇంకా బావుంటుంది అనిపించేట్టుగా ఉంటుంది మనిషి చూడగానే చాలా భయస్థురాలిలాగా ఉంటుందని, స్నేహితులు భీతహరిణి అని ఏడిపిస్తూ వుంటారు ఒక్కొక్కసారి చంద్రకాంతే విసుక్కునేది.

''ఎం ఏ చదువుకున్నావు నీకు ఒంటరిగా క్లాసులోకి వెళ్లాలన్నా ఇంత భయం



ప్రారంభం!









# వెన్నెల కన్నెలు

అయితే రేపు కాలేజీలో పాఠం ఏంచెబుతావు'' అని జ్యోత్స్న ఆ ఆలోచనకే ఒణికేది

''నేను పాఠం చెప్పడం ఏమిటి? బి ఏ లో ఫస్టుక్లాసు వచ్చింది, ఊరికే ఇంట్లో కూర్చోడం ఎందుకు యూనివర్సిటీ ఊళ్ళోనే ఉంది కదా అని చేరాను అసలు ఇక్కడైనా నువ్వు తోడున్నావనె నా ధైర్యం'' అని సమాధానం చెప్పేది

''అంత భయంకదా మన జ్యోత్స్నకి, కొత్తవాళ్ళ మధ్యలో ఎలా బతుకుతుందో ఏమో? వాళ్ళకూడా మగపెళ్ళివారం గదా అని ఇప్పుడే అధికారం చూపిస్తున్నారో, నిజంగా తప్పులు వెతికేవాళ్ళో తెలియటం లేదు'' కుముద నగం పైకి సగం తనలో అనుకుంటున్నట్టుగాను అంది నడుస్తూనే.

''ఇందాక భోజనాలముందు, విడిదిలో చూశావా'' మొట్టమొదటిసారిగా మాట్లాడింది శశికళ.

'ఏమైంది? పెళ్ళికొడుకు చుట్టాల్లో నాకు తెలిసినమ్మాయి కనపడితే మాట్లాడుతూ ఇవతల ఉండిపోయాను. ఎందుకు అతను కేకలేస్తున్నాడు? అవును మనం ఎటు వెడుతున్నాం?'' అన్నీ కలిపి ఒకే ప్రశ్నలో అడిగేసింది చంద్రకాంత.

''ఇక్కడనుంచి మా ఇల్లు ఆట్టే దూరం లేదుగా! మా యింటికి నడుద్దాం ఏం శశీ నడుస్తావా''

అని అడిగి శశి ఔనన్నాక, కుముద, వాళ్ళింటివేపు దారితీసి నడుస్తూ చెప్పటం మొదలుపెట్టింది.

''ఇందాక విడిదిలోకి వెళ్ళగానే వీళ్ళని కుర్చీల్లో కూర్చోపెట్టాలని కుర్చీలు తెచ్చి వేశారు అందులో ఒక కుర్చీలో ఓ కుర్రాడు కూర్చుని ఆడుకుంటున్నాడుట. వాణ్ణి దింపి అది తెచ్చివేశారు ఆ కుర్చీలో వాడు ఆడుకుంటున్న ప్లాస్టిక్ బొమ్మ చిన్నదేదో ఉండిపోలే ఇతను కూచోగానే అది విరిగిందిట. పిల్లలు కుర్చీలెక్కి ఆడటం ఏమిటని ఆ పిల్లాడిని, కుర్చీతెచ్చి వేసేటప్పుడు చూడక్కర్లేదా అని తెచ్చినవాళ్ళని కేకలేశాడు. అది గుచ్చుకునేటంత పెద్ద బొమ్మకాదు ఇంత చిన్న విషయానికే అంతంత కేకలేస్తే ఎలాగో అనిపించింది వాళ్ళ వాళ్ళంతా అతనికి సద్ది చెప్పడానికి, చల్లపరచడానికి ఎంతో ప్రయత్నించారు




అయినా చాలాసేపటిదాకా కోపంగానే ఉన్నాడు అప్పుడు జోత్స్నని చూస్తే నాకు జాలేసింది ఇది ఎవరైనా గట్టిగా మాట్లాడితేనే అదిరిపడుతుంది ఇంక అతను చీటికీ మాటికీ ఇలా కేకలేసే తత్త్వం (ఉన్న) వాడైతే ఎలాగా అని భయంగా ఉంది మళ్ళీ ఇంత చిన్న విషయానికే నేను ఎక్కువగా ఇందాకటినుంచీ ఆలోచిస్తున్నానేమో, అతను అలసటగా ఉండి విసుక్కున్నాడేమో అనిపిస్తోంది'' తనకి తనే ధైర్యము చెప్పుకుంటున్నట్టుగా పూర్తిచేసింది.

''నాకూ అలాగే అనుకోవా లనిపిస్తోంది లేకపోతే జ్యోత్స్న సంగతి తల్చుకోడానికే భయంగా ఉంది'' అంది శశి కుముద ధైర్యానికి సపోర్టుగా.

''ఆఁ! పెళ్ళయాక అంతా చాలా నేర్చుకుంటారుట జ్యోత్స్నకూడా నేర్చుకుంటుంది లేకపోతే నేను నేర్పుతాను'' చంద్రకాంత అభయాన్నిచ్చింది

''నీ మొహం– అయిదేళ్ళు నేర్పలేదుగాని. ఇప్పుడు నేర్పుతుందట. ధైర్యం నేర్పితే వచ్చేది కాదు. మన జ్యోత్స్నకి అసలు రాదు!'' ఇంటి గేటు తీస్తూ చంద్రకి సమాధానం చెప్పింది కుముద

* * *

కుముద, శశికళ, జ్యోత్స్న, చంద్రకాంత ఎం ఏ. హిస్టరీ లో క్లాస్‌మేట్స్ జ్యోత్స్న, చంద్రకాంత ఒకే కాలెజీనుంచివచ్చి యూనివర్సిటీలో చేరారు కుముద వేరే కాలేజీనుంచి, శశికళ వేరే ఊరునించివచ్చి చేరారు చిత్రంగా చేరిన మొదటి నుంచీ వాళ్ళు నలుగురే కలిసి తిరిగారు. చివరిదాకా నలుగురే వున్నారు మధ్య మధ్య మిగిలినవాళ్ళు వచ్చిచేరినా ఇంత సన్నిహితం కాలేకపోయారు

కుముద తండ్రి లాయరు లక్షలార్జించకపోయినా గౌరవంగా కుటుంబం నడుపు

కోవడం తెలిసినవారు. అయిదుగురు పిల్లల్లో కుముదే పెద్దది. నల్లగా వున్నా కళగల మొహం. మంచితనం. చక్కని కంఠం తప్ప కుముదకి చెప్పుకోతగ్గ అందమేమీ లేదు. పొట్టిగా వుండటంతో ఉన్నదానికన్నా లావుగా కూడా కన్పిస్తుంది. కాని ఒకసారి ఆ అమ్మాయితో పరిచయం అయిన ఎవరికైనా ఆ పిల్లని మర్చిపోవడం సాధ్యంకాదు. ఆడపిల్లలకి చదువుతోపాటు ఇంటిపన్లు కుట్లు, అల్లికలు అన్నీ రావాలి. ఎప్పుడే అవసరం వచ్చినా చెయ్యగలిగి వుండాలి. 'నాకు రాదు' అన కూడదు అంటూ ఉంటుంది.

జ్యోత్స్న ఒక ఆఫీసరుగారి కూతురు. అందగత్తెల్లో లెక్కపెట్ట తగ్గది. భయం, మొహమాటం ఎక్కువ. ఏపనిచేస్తే, ఏం మాట్లాడితే ఎవరేం అనుకుంటారో అని తూచితూచి మాట్లాడేరకం. ఇద్దరన్నలకి సరదాగా, ముద్దుగా ఏడిపించడానికి చెల్లెలు. ఇద్దరు చెల్లెళ్ళకి అన్నీ చేసిపెట్టే మంచి అక్కయ్య, తల్లికి చేదోడుగా ఉండే పెద్ద కూతురు. "ఒక పుస్తకం చేతిలో ఉంటే ఒకళ్ల జోలీ శొంఠీ అక్కర్లేకుండా హాయిగా బతకచ్చు" అంటుంది.

శశికళ రిటైర్డు కలక్టరుగారి ఆఖరి అమ్మాయి. బాగా డబ్బున్నవాళ్లని అంతా అనుకుంటారు. గాని ఆ అమ్మాయి మాత్రం అతి నిరాడంబరంగా, తాపీగా బతుకుదాం తొందరేమిటన్నంత నిదానంగా ఉంటుంది. అందగత్తె అని చెప్పలేకపోయినా అనాకారి మాత్రం కాదు. కదలికలో, మాటలో ఒక లాంటి నెమ్మది, లావణ్యం కన్పిస్తాయి. ఉండి ఉండి తను చెప్పదల్చుకున్నది సూటిగా చెప్పేస్తుంది. చూడగానే ఆలోచన ఎక్కువ ఉన్న పిల్లఅనిపిస్తుంది.

చంద్రకాంత తండ్రి ఒక కంపెనీలో ఎకౌంటెంటు. జీవితంలోకూడా ఎకౌంటు ఎప్పటికప్పుడు చెక్‌చేసుకుంటూ, బ్యాలన్స తప్పకుండా నీతిగా బతకాలన్న తత్వం గల మనిషి. ఏడుగురు పిల్లల్లో ఎవరికీ కనీసావసరాలకి లోటురాకుండా, పెద్దకోరికలు కోరుకోవడంలో తప్పులేదు కాని అవి తీరలేదని బాధపడడం తెలివితక్కువ" అనే జీవిత సత్యం పిల్లలకి గుర్తుచేస్తూ ఉంటారు. అందుకే చంద్రకాంతకి తీరుతున్న అవసరాలకన్నా తీరని కోరికల జాబితా పెద్దగా కన్పిస్తుంది. జీవితంలో వెధవ డబ్బుకోసం ఇబ్బంది ఉండకూడదనేది ఆ అమ్మాయి ఆశయం. అనుకున్నది, అనదలుచుకున్నది నిర్భయంగా మొహంమీద అనేస్తుంది. మాట దూకుడు. "ఇంటా బయటా ఏ సమస్యనైనా ఎదుర్కోగల ధైర్యం నాకుంది, నన్నెవరూ ఎదిరించ లేరన్నట్టు" ధీమాగా పొడుగ్గా పొడుక్కి తగ్గ విగ్రహంతో తీవిగా నడుస్తుంది. గబగబా ఎం. ఏ. పాసయి, మంచి ఉద్యోగం సంపాదించేసి, పి. హెచ్. డి చేసేసి, పెద్దరైటరు అయిపోవాలన్నది ఆ అమ్మాయి

(44 వ పేజీ చూడండి)

# ఇది ఈతరం కథ



నాగభైరవ ఆంజనేయులు

ఎక్కుపెట్టి వదిలిన బాణంలా ముందుకు దూసుక పోతున్న ఆర్టీసీ బస్సు స్టేజీకి పది గజాలు ముందుకుపోయి క్రుమని శబ్దం చేసుకుంటూ రోడ్డు పక్కకి చేరి ఆగింది. రెండు గంటలనుండి స్టేజీలో నిలబడి బస్సు కోసం పడిగాపులు కాస్తున్న జనం పిచ్చి కుక్కల్లా పరుగిడుతూ వెళ్ళి బెల్లంమీద ముసిరిన ఈగల్లా బస్సు డోరు దగ్గర మూగారు ఆ మూగిన జనాన్ని మాటలతో దులిపేసి, చేతులతో విదిలించి క్రిందకు దిగి రఫీమని డోరు మూసి బస్సు వెనక్కి చేరాడు కండక్టరు. కుడి అరచేతిని అర్ధ చంద్రాకారంలో నుదిటిమీద పెట్టుకొని స్టేజీవైపు పరీక్షగా చూసి అటువైపు నడిచాడు

స్టేజీలో నిలబడివున్న డాక్టర్ జగన్నాథం కండక్టరు తనవైపు రావటం గమనించి మెదడుకు పని కల్పించాడు. అయితే మెదడు మొండికేయటంతో చిరునవ్వుతో వస్తున్న కండక్టరుకు మందహాసంతో సమాధానం చెప్పాడు

"నేను గుర్తున్నానా!" వస్తూనే అడిగాడు కండక్టరు

"ఆ... ఆ .." జ్ఞాపకం రాకపోయినా నసిగాడు డాక్టరు. తనెవరో డాక్టరుకు గుర్తుకురాలేదని పసిగట్టిన కండక్టరు "నేను రంగయ్యగారబ్బాయిని మనం వీధి బడిలో కలసి చదువుకున్నాం" అని పరిచయం చేసుకున్నాడు

అయినా కండక్టరెవరో డాక్టరుకు గుర్తుకు రావటంలేదు. "నీ పేరు గుర్తుకు రావటంలేదు..." మనిషి మాత్రం గుర్తున్నట్లు పేరు మాత్రమే మరచి పోయినట్లు నటిస్తూ ప్రశ్నించాడు డాక్టరు

"చలపతి మీరు బస్తీకేనా ప్రయాణం "

"ఆ అవును. రెండు గంటల నుండి యిక్కడ నిలబడి వున్నా వచ్చిన బస్సులన్నీ ఆగకుండానే వెళ్ళిపోయాయి."

"రండి ... వెళదాం మా బస్సులో" బస్సువైపు చూస్తూ పిలిచాడు కండక్టరు చలపతి

"బాగా రష్‌గా వున్నట్లుంది " వెళ్ళాలని వున్నా మాటవరసకలా అన్నాడు డాక్టరు.

"ఫర్వాలేదు "

ఇద్దరూ బస్సు దగ్గరకు నడిచారు. కండక్టరు చలపతి అక్కడ బస్సెక్కిన వారందరినీ 'ఖాళీ లేదు' అంటూ క్రిందకు దింపి డాక్టరు జగన్నాథాన్ని తన సీటులో కూర్చోబెట్టి, పక్క సీట్లో కూర్చున్నతన్ని లేపి అక్కడ తను కూర్చొని రైటు చెప్పాడు. బస్సు ముందుకు పరుగెత్తింది

చింపి యిచ్చిన టిక్కట్టుకు డాక్టరు జగన్నాథం డబ్బులు యివ్వబోతే వద్దని వారించాడు కండక్టరు చలపతి బలవంతం చేస్తే కాదంటూ నిరాకరించాడు ఎంత ప్రయత్నించినా చలపతి గురించి కాస్తయినా గుర్తుకు రాలేదు డాక్టర్ జగన్నాథానికి

పొడుంకాయ మాష్టారు గురించి, మునసబుగారి పొట్ల పొదుల్ని పాడుచేసిన సంగతి

గుర్తుచేశాడు చలపతి. లక్షలు తప్పించిన పలకపంతులుచేత జగన్నాథం తిన్న దెబ్బలు కూడా చలపతి గుర్తుచేశాడు జగన్నాథానికి ముళ్లమీద కూర్చున్నట్లుంది కండక్టరు తన స్నేహితుడని— తనకు తెలిసినవారికి తెలిస్తే ఎంత చిన్నతనం! వెనక్కి తిరిగి చూశాడు డాక్టరు ఆ బస్సులో తనకు తెలిసిన వారెవరూ లేకపోవటంతో తేలిగ్గా గాలి పీల్చుకున్నాడు

''మీరు ఈ వూర్లో వున్నట్లు మొన్నీ మధ్యే తెలిసింది రావటానికి కుదిరిందిగాదు. లక్కీగా ఈరోజు కలుసుకోగలిగాం'' కండక్టరు చలపతి తన సంతోషాన్ని స్వరంలోనూ, ముఖంలోనూ వ్యక్తం చేస్తున్నాడు ఇష్టం లేకపోయినా డాక్టరు తనూ సంతోషిస్తున్నట్లు చెప్పక తప్పలేదు

చలపతి, డాక్టరు సంతానాన్ని గురించి అడిగి తెలుసుకున్నాడు డాక్టరు తన ఉద్యోగం గురించి చెబుతున్నప్పుడు తన్మయత్వంతో విన్నాడు చలపతి తన స్నేహితుడు డాక్టరయినందుకు తనెంత గర్వపడుతున్నాడో గర్వంగా చెప్పాడు కండక్టరు చలపతి

సభ్యత కోసం డాక్టర్ జగన్నాథం చలపతి సంసారాన్ని గురించి, వుద్యోగాన్ని గురించి అడిగాడే గాని—సమాధానాల్ని వినలేదు.

అదేదో స్టేజీలో బస్సాగింది కండక్టరు లేచి వెనక్కి తిరిగి ''ఎవరైన కాఫీ త్రాగేవాళ్ళు దిగండి'' అని కేకేసి ''రండి కాఫీ త్రాగుదాం'' అని డాక్టరును ఆహ్వానించాడు

''అబ్బే ఇప్పుడెందుకు?'' డాక్టరు సన్నగా అన్నాడు

కండక్టరు బలవంతం చేయటంతో డాక్టరు బస్సుదిగి హోటల్లోకి నడిచాడు. వద్దని డాక్టరు వారిస్తున్నా స్వీటుకు,హాటుకు ఆర్డరిచ్చాడు చలపతి ''వీడెవడో అఖండుడిలా వున్నాడు అరవై పైసల టిక్కెట్టిచ్చి 'ఐదారు రూపాయల హోటలు బిల్లును అంట గట్టేలా వున్నాడు'' మనసులో తిట్టుకున్నాడు డాక్టర్ జగన్నాథం

కాఫీ అయాక కండక్టరు చలపతే బిల్లు అందుకొని చెల్లించాడు తిరిగి బస్సులోకి వచ్చారు బస్సు బయలుదేరింది ''మా ఆవిడకు ఈ మధ్య ఆరోగ్యం అంత బావుండటం లేదు. ఎన్నోచోట్ల చూపించాను ఏవేవో మందులు వాడాం గాని-అంతగా ప్రయోజనం కనబడలేదు ఒకసారి మీ దగ్గరకు తీసుకవద్దామనుకుంటున్నాం'' కండక్టరు డాక్టరుతో చెప్పాడు

''ఓ దానిదేం వుంది ఒకసారి తీసుక రండి''

బస్సు బస్తీకి చేరింది చలపతితో చెప్పి డాక్టర్ జగన్నాథం బస్సుదిగి వెళ్లిపోయాడు. అవుట్ డోర్ షూటింగుకు వచ్చిన తన మిత్రుడు హీరో సూరిబాబును కలుసుకునేందుకు.

* * *

అది హోటల్ అభిలాషలో. ఆరో నంబరు గది డాక్టర్ జగన్నాథం తనతో తెచ్చిన అట్ట పెట్టెను రిక్షావాడితో గదిలో పెట్టించాడు.

''ఇవి టానిక్స్ కాప్సుల్స్. అవసరానికి పనికొస్తాయని తెచ్చాను ఏవి దేనికి పనికి వస్తాయో వాటిమీద వ్రాశాను కూడా'' డాక్టరు చెప్పాడు

''అబ్బే.. ఎందుకండీ మీకు శ్రమ'' సన్నగా నవ్వుతూ అన్నాడు హీరో సూరిబాబు.

''దీనిలో శ్రమేముంది'' సూరిబాబు చూపించిన కుర్చీలో కూర్చుంటూ అన్నాడు డాక్టర్.

హీరో సూరిబాబు అవుట్ డోర్ షూటింగుకు వచ్చి మూడు రోజులయింది సూరిబాబు వచ్చిన రోజే జగన్నాథం అతన్ని కలుసుకున్నాడు జగన్నాథం సూరిబాబు దగ్గరకు రావటం యిది రెండవసారి

ఇద్దరూ మాట్లాడుకునే సమయంలో డైరెక్టర్ విశ్వం వచ్చాడు. డాక్టర్ జగన్నాథం ఆరోజు పోస్టాఫీసునుండి డ్రా చేసి తెచ్చిన నాలుగొందలు కరిగించి రెండు యింపోర్టెడ్ విస్కీ బాటిల్స్ తెప్పించాడు.

కబుర్లు చెప్పకుంటూ రెండు సీసాలను కానిచ్చారు ముగ్గురూ కలసి. పార్టీ పూర్తయాక ఇద్దరితో వెళ్లొస్తానని చెప్పాడు డాక్టర్ జగన్నాథం. 'ఎప్పుడయినా వీలు చేసుకొని మద్రాస్ రండి'—విశ్వం, సూరిబాబు చెప్పారు. 'అలాగే'నంటూ గదినుండి బయటకు నడిచాడు డాక్టరు జగన్నాథం.

ఐదు నిముషాలు మౌనంగా గడిచిపోయాయి. డైరెక్టర్ విశ్వం సూరిబాబును అడిగాడు ''ఎవరండీ ఈ పార్టీ ఫ్రెండు''అని.

సూరిబాబు పకపకా నవ్వాడు. నవ్వి అన్నాడు ''చదువుకునే రోజుల్లో కాలేజీలో క్లాస్‌మేటట. మొన్న వచ్చి పరిచయం చేసుకున్నాడు. పిచ్చిమాలోకంలా వున్నాడు. అవిగో... ఏవో మెడిసన్స్ తెచ్చిపడేశాడు. ఏం లేదులే. ఫీల్డులో పేరున్న నన్ను పూసుక తిరగాలని ఆయన ఉబలాటంలా వుంది. ఏమయితేనేం వెతుక్కుంటూ వచ్చి ఈ రోజు పార్టీకి మనం వెతుక్కోకుండా చేశాడు. పిచ్చిమారాజు''

డైరెక్టర్ విశ్వంకూడా హీరో నవ్వుతో శృతి కలిపాడు.

* * *

రెండు వారాల తర్వాత —

కండక్టరు చలపతి తన భార్యతో డాక్టరు జగన్నాథం పని చేస్తున్న గవర్నమెంటు



## ఇది ఈతరం కథ

ఆస్పత్రి (పి హెచ్ సి)కి వచ్చాడు వరండాలో వేసున్న బల్లమీద కూర్చుంటూ పేరు చెప్పి తను వచ్చినట్లు డాక్టరుతో చెప్పమని కాంపౌండరుతో చెప్పాడు. గంట గడిచింది. డాక్టరు పిలుపుకోసం చలపతి ఎదురు చూస్తూ కూర్చున్నాడు ఎంతకీ డాక్టరు లోపలికి రమ్మని కబురు చేయక పోవటంతో కాంపౌండరుకు జ్ఞాపకం చేశాడు చలపతి మరోసారి. లోపలికివెళ్లి తిరిగొచ్చిన కాంపౌండరు "మిమ్మల్ని డాక్టరుగారు రమ్మంటున్నారు" అని చెప్పి బయటకు వెళ్ళిపోయాడు భార్యను తీసుకొని చలపతి డాక్టరు గదిలోకి వెళ్ళాడు

చలపతి భార్యను ఏవో కొన్ని ప్రశ్నలడిగి రెండు నిమిషాలు పరీక్షచేసి 'ఎనీమియా పెద్ద జబ్బేమీలేదు' అని చెప్పాడు డాక్టరు జగన్నాథం, చలపతితో.

డాక్టర్ జగన్నాథం— అంతకు ముందు వచ్చిన మెడికల్ రెప్రజెంటేటివ్ చిరునవ్వుతో బల్లమీద పెట్టిన ". . ....." టానిక్ సీసాలవైపు ఒక్క క్షణం చూసి "అవి ఈ కండక్టరుకు యిచ్చినందువల్ల ఏం ప్రయోజనం వుండదు" అని అనుకొని కలం తీసుకొని ప్రిస్క్రిప్షన్ వ్రాసి చలపతికిస్తూ "ఈ మందులు వాడండి సరిపోతుంది" అన్నాడు ముక్తసరిగా

"మీ ఇల్లెక్కడ " అడిగాడు చలపతి

"ఇక్కడకు చాలాదూరం వెళ్లచ్చు గాని మా ఆవిడ పుట్టింటికి వెళ్లింది" అన్నాడు డాక్టర్ గబగబా, యింటికి వస్తానంటాడేమో నన్న భయంతో.

"వదిన్ను చూద్దామనుకున్నా. నెయ్యి తెచ్చాను. ఇంటికి పంపండి" అంటూ చేతిలోని టిఫిన్‌ను చూపించాడు చలపతి.

కాంపౌండరును పిలిచి నేతి టిఫిను యింటికి పంపాడు డాక్టర్ జగన్నాథం. ఖాళీ టిఫన్ తెచ్చి చలపతి కిచ్చాడు కాంపౌండరు.

"వెళ్లొస్తామండి" నమస్కరించి చలపతి, అతని భార్య డాక్టరు జగన్నాథంతో చెప్పారు.

"మందులు అయిపోయాక మళ్లీ తీసుకరండి" చిరునవ్వుతో చెప్పాడు డాక్టరు జగన్నాథం.

చలపతి వెళ్లిపోయాక కో — డాక్టర్ చంద్రం జగన్నాధాన్ని అడిగాడు "ఎవరా శాల్తీ" అని



నల్లని కొండలోయపైన ఎర్రని కోట
పరుచుకున్న పచ్చల్లాంటి అడివిలో
దంతంలాంటి 'పొణికి' కర్రను
నల్లని 'బావురాయి'తో బాదంరంగు చేతులు చెక్కి
ఎర్రని సెగలో వంచితే
సీతాకోకచిలక చీర కట్టుకుని
చింతగుజ్జుతో వాటిని అతికి
గులాబీల సంతోషాన్ని,
పట్టులోని జాలువారు తనాన్ని
ఆకాశపు నీలిమనూ
కరగని చెరగని రంగుల హంగులతో వేస్తే
కళ్ళ ముందర నిలుస్తుంది రంగుల రాజ్యంగా
కొండపల్లి బొమ్మలుగా

అంతా రంగుల మయం




రంగు మన జీవితంలో ఒక సమగ్రమైన భాగం—నెరొలాక్

## ధర్మపథం

### ఆలయ నిర్మాణ పద్ధతి

మన దేశంలోని ఆలయాలను పరిశీలిస్తే, ఆ యా పద్ధతులు ఎందుకు ఏర్పడినదీ అర్థమవుతుంది.

ప్రాచీన కాలంలో దేవాలయాలన్నీ శిలల తోనే నిర్మింపబడేవి శిలా నిర్మితాలయినవి మాత్రమే ఎన్నో శతాబ్దాలు శిథిలం గాకుండా ఉంటాయి ప్రాచీనకాలపు దేవాలయాలు మాత్రం ఇప్పుడు కానవస్తున్నవి ఇతర భవనాలు కానరావడం లేదు

ఆలయాలు గ్రామం మధ్యనూ కాకుండా చివరనే ఉంటాయి. పట్టణాల్లోను అంతే ప్రశాంతమైన వాతావరణం ఉండడంకోసమే అలా నిర్మింపబడి ఉంటాయని గ్రహించ వచ్చును. తర్వాతి కాలంలో క్రమంగా దేవాలయం చుట్టూ ఇళ్లు లేవడం ప్రారంభ మయింది ఇప్పుడు కొన్ని దేవాలయాలు అంగళ్లుగా కూడా మారిపోవడం చాలా విచారకరం.

దేవాలయం పరమ పవిత్రమైన స్థలం. అందులో ప్రవేశించేవారి మనస్సు నిర్మలంగా ఉండడమే కాకుండా శరీరంకూడా పరిశుద్ధంగా ఉండాలి కాబట్టి దానిదగ్గర స్నానానికి తగిన సౌకర్యం ఉండాలి దీనిని గ్రహించియే మన వారు నదీతీరంలోగాని, పెద్ద పెద్ద జలాశయాల తీరంపైగాని దేవాలయాలను నిర్మించేవారు. జలాశయాలు లేనిచోట్ల దేవాలయం చేరువనే చెరువులు త్రవ్వించేవారు. రామేశ్వరం మొదలైన కొన్నిచోట్ల సముద్ర తీరాన దేవాలయాలున్నవి సముద్ర స్నానానంతరం శుద్ధజల స్నానానికి అనువుగా అట్టి స్థలాలలో కూపములు ఏర్పరుపబడి ఉన్నవి.

ఇవి సామాన్యంగా తూర్పు ముఖంగానే నిర్మింపబడుతూ ఉంటాయి మనం ఏ కార్యం ప్రారంభించినా తూర్పుముఖంగా కూర్చుని ప్రారంభించడం సాంప్రదాయం ప్రత్యక్ష దైవమైన సూర్యుణ్ణి గౌరవించడం కూడా ఇందులో ఇమిడి ఉన్నది

'యాని కాని చ పాపాని జన్మాంతరకృతాని చ,
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే'

అని ప్రదక్షిణం పాపాలను నశింపజేస్తుంది. శ్రీజగన్నాథం మున్నగు కొన్నిచోట్ల తప్ప మూలవిగ్రహాలకు ప్రదక్షిణం చెయ్యడం కాదు అందువల్ల గర్భగుడికి ప్రదక్షిణం చెయ్యడానికి అనుకూలంగా నిర్మాణం జరుగుతూ ఉండేది.

దేవాలయ ద్వారానికి కుడివైపున–ఎడమ వైపున – అంటే ఉత్తర, దక్షిణ దిక్కులుగా వరుసగా ఇండ్లు ఉండడం ఒక నియమం వీధికి ఎదురుగా దేవాలయం నిర్మింపబడేదన్న మాట అంతేకాని ఇళ్లతో కలిపి, ఇళ్ల వరసలో దేవాలయం నిర్మింపబడేది కాదు. ఈ కాలంలో ఇష్టంవచ్చినట్లు ఇళ్లతోకలిపే దేవాలయాలు కానవస్తున్నవి తూర్పుముఖంగా లేని దేవాలయాలు కూడా చాల కానవస్తున్నవి ఇవి పూర్వ సంప్రదాయానికి విరుద్ధంగా ఉంటున్నవి పూర్వం దేవాలయాన్ననుసరించే వీధులు ఏర్పడేవి ఆ పద్ధతి దేవాలయాలపై ప్రజలకు ఉండే గౌరవాన్ని సూచిస్తున్నవి

పాతకాలపు నిర్మాణ పద్ధతులిని ఇప్పుడు వేలకొలదీ నిర్మించబడే దేవాలయాల్లో ప్రాచీనపద్ధతి ననుసరించేవీ, కేవలం శిలా నిర్మితాలూ చాలా తక్కువ

—బులుసు వేంకట రమణయ్య

---

## ఇది ఈతరం కథ

"బడిలో క్లాస్‌మేట్ అట మొన్న టౌన్‌కి వెళ్లేప్పుడు బసులో చూశాడు జిడ్డులా వున్నాడు అంత సులభంగా వదిలేట్టులేడు అంతా డాక్టరు, నా స్నేహితుడు అని భుజాలెగరేసుకుంటూ చెప్పుకోవాలన్న తాపత్రయం" చిరాగ్గా అన్నాడు జగన్నాథం.

"మీ ఆవిడ పుట్టింటికి ఎప్పుడెళ్లింది" డాక్టర్ చంద్రం

"అబ్బే. వెళ్లలేదు ఆ జిడ్డు యింటికి కూడా తగలడుతుందని అలా చెప్పాను" డాక్టరు జగన్నాథం తన సమయస్ఫూర్తికి మురిసిపోతూ చెప్పాడు

* * *

నాలుగు నెలలు గడిచాయి

డాక్టరు జగన్నాథం తిరుపతి నుండి తిరిగి వస్తూ హీరో సూరిబాబును చూడాలని మద్రాసు వెళ్లాడు. ఇరవై రూపాయలకు ఆపిల్స్‌ని కొని సూరిబాబు యింటికి వెళ్లాడు తిన్నగా సూరిబాబు 'వాహినీ'లో షూటింగ్‌లో వున్నాడని అతని యింటి దగ్గర చెప్పటంతో పళ్ళబుట్టను యింట్లోకి పంపి (పని కుర్రాడితో) వాహినీకి వెళ్లాడు.

గేట్‌కీపర్ చేతిలో రెండ్రూపాయలుంచి విజిటింగ్ కార్డును హీరో సూరిబాబుకు పంపించాడు డాక్టర్ జగన్నాథం రెండు గంటలు గడిచినా సూరిబాబు లోపలికి రమ్మని చెప్పి పంపలేదు మరో రెండ్రూపాయలు సమర్పించుకొని గేట్‌కీపరును బ్రతిమాలి సూరిబాబుకు తనొచ్చినట్లు గుర్తు చేశాడు సూరిబాబు అంగీకారం తీసుకుని గేట్‌కీపరు డాక్టరు జగన్నాథాన్ని లోపలికి పంపాడు

జగన్నాథాన్ని చూస్తూనే అక్కడున్న కుర్చీలో కూర్చోమని చెప్పాడు హీరో సూరిబాబు దూరంగా వేసున్న కుర్చీల్లో డైరెక్టరు, హీరోయిన్ రాణి కూర్చొని వున్నారు సూరిబాబు వెళ్ళి హీరోయిన్ ప్రక్కనే వున్న కుర్చీలో కూర్చున్నాడు. డాక్టర్ జగన్నాథం వాళ్ళవైపు చూస్తూ ఒంటరిగా కూర్చున్నాడు డైరెక్టరు, రాణి, సూరిబాబు ఏదో చెప్పుకుంటూ మధ్య మధ్య పగలబడి నవ్వుతున్నారు. సూరిబాబు డాక్టరు జగన్నాథం వైపు చేయి చూపించి హీరోయిన్‌తో ఏదో చెప్పాడు అందరూ ఒక్కసారి ఘొల్లున నవ్వారు డాక్టర్ జగన్నాథం మనసు చివుక్కుమంది సూరిబాబు మీద కాస్త కోపంకూడా వచ్చింది 'మానెర్ లెస్' అనుకున్నాడు తన ఉనికినే గుర్తించనట్లు ప్రవర్తిస్తున్న సూరిబాబంటే అసహ్యమేసింది డాక్టరు జగన్నాథానికి ఆ రోజు తను ఖర్చు పెట్టిన డబ్బు డాక్టర్ కళ్లముందు కదిలింది ఒక్క క్షణం తానిచ్చిన 'వెట్ పార్టీ' లీను కుంటూ సూరిబాబు ఒలకబోసిన ఆప్యాయత గుర్తొచ్చింది డాక్టర్ జగన్నాథం కుర్చీలోంచి లేచి గబగబా అడుగులేసుకుంటూ బయటకు నడవసాగాడు

అయితే ఒక విషయం జగన్నాథానికి సూరిబాబు ప్రవర్తన చూసి కోపమొచ్చింది గాని . . కండక్టరు చలపతి ఆ రోజు బస్సులో తనమీద చూపిన ఆప్యాయతగాని లేదా చలపతి తన దగ్గరకు వచ్చినపుడు తాను కావాలని చూపిన నిర్లక్ష్యంగాని కాస్తంతయినా గుర్తుకు రాలేదు

అంతేకాదు. హీరో సూరిబాబు తనకన్నా

తనకంటె ఒకమెట్టు క్రింద వున్నాడని ఆ క్షణంలో డాక్టరు జగన్నాధానికి జ్ఞప్తికి రాలేదు అదీగాక తను క్రిందమెట్టు చూడలేక పోతున్నాడని, తన దృష్టి ఎప్పుడూ పై మెట్టు మీదనే వుంటుందని డాక్టర్ జగన్నాధానికి స్ఫురించలేదు

ఇంకా తనలా హీరో సూరిబాబు గూడా క్రిందికి — తనవైపు — చూపు మరల్చలేక పోతున్నాడని, అతని కంటె పై అంతస్థులో నున్న డైరెక్టరు, హీరోయిన రాణి వైపే చూడగలుగుతున్నాడని ఆ క్షణంలో డాక్టర్ జగన్నాధం సరిపెట్టుకోలేక పోయాడు

బాధగా, బరువుగా అడుగులు వేసకుంటూ స్టూడియో నుండి బయటపడ్డాడు డాక్టర్ జగన్నాధం.

సీరియల్

# మనసులో మలుపులు

జీడిగుంట రామచంద్రమూర్తి

"చాలా ఆలస్యమయింది మేమూ యింక బయ ల్దేరుతాం" అన్నాడు సూర్యం కుర్చీకి ఆన్చివున్న 'క్రచెస్'ను చేతిలోకి తీసుకుని లేచి నిలబడి 'వస్తానండీ' అంటూ నమస్కరించింది రంగనాథ్‌కి

అతను ప్రతి నమస్కారంచేసి వాళ్లతో పోర్టికో వరకూ కూడా వచ్చాడు సుగుణ కార్లో కూర్చున్న తర్వాత —

"అన్నట్లు వచ్చే నెలలో 'లైట్ మ్యూజిక్ కాంపిటీషన్స్' జరుగుతున్నాయి 'ఆలిండియా లెవెల్'లో జరుగుతాయి సుగుణగారుకూడా పాల్గొనాలి" అన్నాడు రంగనాథ్ సూర్యంతో

"కావల్సినవాళ్లకదా అని మాపట్ల 'ఫేవర్' చూపిస్తున్నావని ఎవరూ అనుకోరు కదా ?" అన్నాడు సూర్యం స్టీరింగ్ ముందు కూర్చుంటూ

"అనేవాళ్లు అనుకున్నా — 'వర్త్' వున్న వాళ్లకి అవకాశాలు కల్పించటంలో తప్పులేదంటాను పైగా రేడియో కార్యక్రమాలు వినేది వాళ్లూ నేనూ కాదు లక్షలాది శ్రోతలు! వాళ్లు మెచ్చే కార్యక్రమాల్ని — మనసుకు నచ్చే కార్యక్రమాల్ని యివ్వటమే మా లక్ష్యం కావాలి! అటువంటప్పుడు ఎవరో కొందరు అపోహపడినా — మాకు మిగిలేది ఎంతృప్తేకానీ — వినిపించేవి వాళ్ల మాటలు కావు"

"ఓకే! థాంక్యూ!" అంటూ కారు స్టార్ట్' చేశాడు సూర్యం ప్రక్కనే కూర్చున్న సుగుణ అతనివైపు తృప్తిగా చూసింది మరో రెండు నిముషాల్లో — అక్కడకు దగ్గరలో వున్న పెద్ద హోటలుకు వచ్చి ఆగింది కారు

"ఇప్పుడేగా కాఫీ త్రాగాం! మళ్లీ ఎందుకూ?" అర్ధంకాని సుగుణ అడిగింది

"కాఫీకోసంకాదు కబుర్లకోసం!" అంటూనే నెమ్మదిగా లోపలకు నడిపించుకుని వెళ్లాడు హోటల్లో జనం పల్చగా వున్నారు ఓ మూల ఖాళీగా వున్న టేబిల్ దగ్గర కూర్చు న్నారు యిద్దరూ

"మనం చాలా అదృష్టవంతులం!" అన్నాడు సూర్యం

"ఎందుకనీ ?"

"ఇందాకా నువ్ రంగనాథ్‌ని 'పెళ్లి అయిందా?' అని ప్రశ్నించావ్ గుర్తుందా ?"

"అవునవును! ఆయన ఏం చెప్పారు ?" అడి గింది సుగుణ

"ఏమీ చెప్పలేదు· సరిగా ఆ సమయానికే ఫోన్ మ్రోగటం వల్ల నీ ప్రశ్న వినిపించుకోలేదు

*(గత సంచిక తరువాయి)*

వినివుంటే మనం బాధ పడవలసివచ్చేది!"

"ఎందుకూ ?"

"అతని బాధ చూడలేక"

"ఏమిటో మీ మాటలు నా కర్థం కావటం లేదు"

"మరేం లేదు రంగనాథ్ కాలేజీలో చదివే రోజుల్లో, ఓ అమ్మాయితో ప్రేమాయణం సాగిం చాడు చివరి కది ఫెయిలైంది అప్పటి నుంచీ పెళ్లి గురించీ, ప్రేమ గురించీ ఎవరైనా తన దగ్గరన్నా — తాను మరెవరి దగ్గరైనా విన్నా — మనిషి అదోలా అయిపోతాడు! దాదాపు ఏడ్చేస్తాడు కూడా!"

"ఓ మై గాడ్!" — అటువంటి పరిస్థితి రానందుకు సుగుణ స్థిమితపడింది

అంతలో అక్కడకు వచ్చి నిలబడ్డ సర్వర్‌ను, రెండు 'కోకోకోలా' తెమ్మని ఆర్డరిచ్చి పంపేశాడు

## 10

ఆరోజు సాయంత్రం నాలుగ్గంటలకే శ్రీపతి, ఇంటికి వచ్చేశాడు

అసలు శ్రీపతి, ఆఫీసునుండి ఎప్పుడూ ఒకే టైముకి రాకపోవటాన, వాళ్లాఫీసుకు అసలు టైమనేదే వుండదనుకునే ధోరణికి అలవాటు పడినా — ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రీ అపరాత్రీ అతను ఇంటికి వచ్చే పరిస్థితిని చూసినప్పుడు, అసలు శ్రీపతి ఆఫీసులో పని చేస్తున్నాడో లేదోనన్న అనుమానంకూడా వస్తూండేది — రాధకి!

శ్రీపతి ఆరోజు నాలుగుగంటలకు రాగానే, రాధని పిలిచాడు రాధ వచ్చింది కానీ పలకలేదు

"ఏవిటీ బుద్ధ అవతారంలా నిలబడ్డావ్ ?"

"దశావతారాల్ని దెప్పడమెందుగ్గానీ ఏవిటో చెప్పండి" అసహనంగా అడిగింది రాధ

"చెప్పండన్నమాట ముందేడిస్తే, · నువ్ బుద్ధావతారమెలా అవుతావ్ ? పొన్లేకానీ తొందరగా తయారవ్!"

ఎక్కడికంటే మళ్లీ ఏం చివాట్లు పెడతాడో నని, సాధారణంగా బజారుకు వెళ్లే దుస్తుల్లో బయటకు వచ్చింది అప్పటికే శ్రీపతి సూట్ వేసుకుని తయారుగా వున్నాడు

సూట్‌లో అందంగావున్న శ్రీపతిని చూస్తూ రాధ అనుకుంది —

"భగవంతుడా! అందానికితగ్గ మనసిస్తే నీ సొమ్మేం పోయింది ?" అని

"ఏమిటీ ఆలోచిస్తున్నావ్! నీ హేండ్‌బ్యాగ్ తీసుకున్నావా ?"

"లేదు!"

"మరి అన్నీ నేనే చెప్పాలా ?" అని ఆమె వైపూ ఆమె అలంకరణవైపూ ఓసారి నిదానంగా చూశాడు

"లిప్‌స్టిక్ కొనటానికి ఓపిక లేకపోతే, కాస్తంత తమలపాకులైనా వేసుకో" అన్నాడు

"మీ సిగరెట్లు పెదాలకంటే ఫరవాలేదులెండి!"

"అసలు నీ పెదాల్లో వున్న ఎరుపంతా నాదే కదా ?" — ఏదో పెద్ద విలువైన జోకు వేసినట్లు పగలబడి నవ్వేడు శ్రీపతి రాధ నిర్లిప్తంగా నవ్వింది

బయటకు వచ్చి టాక్సీలో కూర్చున్నారు 'పారిస్ హోటల్' అని శ్రీపతి అనడం మాత్రం విన్నది

పారిస్ హోటల్ని చూడగానే — ఎబ్బెట్టుగా అలంకరించుకున్న అమ్మాయిలా అనిపించింది చుట్టూ ఎటు చూసినా రబ్బరు బెలూన్లూ, వరుసగా వేసిన టేబిల్స్ మీద తెల్లటి టేబిల్ క్లాత్సూ, అటూ యిటూ కుర్చీలూ ఆ టేబిల్సుమీద అటూ ఇటూ సీసాలూ గ్లాసులూ దూరంగా ఓ స్టేజీ దానిమీద తలా వళ్లూ వికృతంగా తిప్పుతూ, ఇంగ్లీషు వాయిద్యాల్ని వాయిస్తూ కొడుతూంటే వస్తున్న ఎంత సంగీతం!

శ్రీపతి, చెయ్యి పట్టుకుని లోపలకు లాక్కుపోతూంటే ఎబ్బెట్టుగా అనిపించింది రాధకి మెల్లిగా చేతిని తప్పించుకోబోతే, విసుక్కుని తిట్టి నట్టు, పెదాల మధ్య వినబడని మాటలు

సీట్లలో సర్దుకున్నారు ఇంతలో ఓ లావుపాటావిడ తొడల క్రిందకు గౌను సుతారంగా లాక్కుంటూ ఏదో అంది అందరూ చప్పట్లు

**జరిగిన కథ 6.** తన చిన్ననాడే తమతో సంబంధం తెంపుకున్న మేనమావ వెంకట్రామయ్య ఇంటికి వెళ్తాడు సూర్యం వెంకట్రామయ్య భార్య వర్ధనమ్మ కూతురు రాధ తన తల్లి బ్రతికుండగానే తన పెళ్లాంగా ముద్ర వేయించుకున్న రాధ ఎలా వుంటుందో తెలీకపోయినా ప్రాణప్రదంగా ప్రేమిస్తాడు సూర్యం రాధని తనకిచ్చి పెళ్లి చేయటం వెంకట్రామయ్య కిష్టంలేదని తెలిసిన సూర్యం ఆ వూరి నుంచి వచ్చేస్తాడు కమతగాడైన తనను ఆదిశేషయ్య అల్లుడిగా చేసుకోవటం, భార్య శాంత మరణం, వెంకట్రామయ్య ప్రవర్తన, తనను ఆదుకున్న రాజారాంగారు అందరూ గుర్తుకొస్తారు శేషగిరికి రాధను సూర్యాని కిమ్మని అడగవచ్చిన శేషగిరిని అవమానిస్తాడు వెంకట్రామయ్య పరిస్థితులలో రాజీపడి ఉద్యోగంలో చేరాలనుకున్న సూర్యం రాజారాంగారి దగ్గరకు హైదరాబాద్ వెళ్తాడు రాధకు ఎండోమెంట్స్‌లో పని చేస్తున్న శ్రీపతితో వివాహమైందని తెలిసి బాధ పడతాడు సూర్యం రాజారాంగారి కూతురు సుగుణకు కుంటితనం రాజారాంగారి సాయంతో వుద్యోగం సంపాదించుకున్న సూర్యం సుగుణపట్ల శ్రద్ధ చూపుతాడు

వర్ణించారు పీనుగులా, సన్నగా, తెల్లగా, పొడవుగా, పాలిపోయినట్టున్న అమ్మాయి స్టేజిమీదకు వంకర్లు పోతూ వచ్చింది ఏదో అరచింది అందరూ తలలూపుతూ వింటూంటే ఆశ్చర్యపోయింది రాధ ఆ పాట అయిపోయేంతవరకూ నొప్పి వచ్చినట్టుగా తల పట్టుకుంది !

అది గమనించి, శ్రీపతినే గుచ్చి గుచ్చి చూస్తున్న మనుషుల తాకిడి చూపులకి శ్రీపతి ఉలిక్కిపడి రాధ వైపు చూశాడు వాళ్ళు చూడకుండా రాధని మోచేత్తో పొడిచాడు

"నీకు తల పోటుగా ఉందని అందరికీ చెప్పక్కర్లేదు" అన్నాడు గుస గుస లాడుతున్నట్లు

"పోనీ మీకు తెలిసింది చాల్లెండి!" అంటూ సర్దుకుని కూర్చుంది రాధ

ఇంకో అమ్మాయి, మరో జూలున్న కుర్రాడు, ఇంగ్లీషు నృత్యం చేశారు అందరూ, అది గొప్పగా వుందని చప్పట్లు చరిస్తే — 'అమ్మయ్య! అయిపోయిందికదా' అని ఆనందపడింది రాధ

ఆ తర్వాత మైకులో, ఎవరో ఏదో చెప్పారు అందరూ టేబిల్‌మీదున్న సీసాల్నీ గ్లాసుల్నీ గలగలా అందుకున్నారు అక్కడున్న 'చిప్స్ ప్యాకెట్లు' విప్పుతూంటే, పావురాళ్లకి రెక్కలు పీకుతున్న చప్పుడులా అనిపించింది రాధకి

రాధకి ఓ గ్లాసు అందించాడు శ్రీపతిని నిశితంగా చూసింది ఆ నిశితమైన చూపులకి, తగిన సమాధానం ఇంటిదగ్గర ఇస్తానన్నట్టు చూసి, రాధ చేతిలో వున్న గ్లాసులో ఏదో పోశాడు రాధకి వెగటుగా అనిపించింది దిగులుగా వుంది అక్కడున్న అంతమందీ — ఆడా మగా — ఎందుకలా ఆహ్లాదంగా వున్నారో, ఆ గ్లాసులో వున్న దాన్ని తాగి, అంత హాయిగా ఎందుకున్నారో అర్థంకాలేదు

బలవంతంగా తన చేతికిచ్చిన గ్లాసులోని ద్రవానికీ — శ్రీపతి దగ్గర అప్పుడప్పుడు గుప్పుమని కొట్టవచ్చే వాసనకూ తేడా లేదు

తనెప్పుడూ తాగలేదు కానీ తాగిన భర్తని భరించటం అలవాటు చేసుకుంది మళ్ళీ కాసిని చప్పట్లు ముగిశాక, పదిమంది సూటు మనుషులు, అటూ యిటూ బిలబిలా తిరిగి స్టేజి ముందర కూర్చున్నారు

ఆ తర్వాత మైకు దగ్గరున్న వ్యక్తి ఏదో పేర్లు చదవటం, ఆ వెంటనే స్టేజీమీదకి ఓ ఆడా మగా వచ్చి అనవసరంగా స్టేజీమీద కలతిరగడం చూసి నవ్వొచ్చింది రాధకి! ఆ చదివే పేర్లను బట్టీ, వాళ్ళ తిరిగే పద్ధతినిబట్టీ — వాళ్ళు భార్యాభర్తలని అనుకుంది కానీ అంతమంది సిగ్గులేని భర్తలు వుంటారని తెలియగానే తన ఉనికిని తలుచుకుని ఊరటపడింది

అలా ఆలోచిస్తూ చూస్తున్న రాధ ఉలిక్కిపడింది తన పేరు చదివారు శ్రీపతి నుంచుని తనవైపే చూశాడు మళ్ళీ మూడోసారి చదివారు

అంటే ?

రాధ వంటి మీద తేళ్ళూ,జెర్రిలూ పాకినట్టనిపించింది శ్రీపతి చెయ్యి తనమీద ఎప్పుడు పడిందీ, తనెప్పుడు లేచిందీ, ఎలా నడచిందీ తెలియనేలేదు



స్టేజిమీద [illegible] దిగ్రమింగుకుంది అందరూ చప్పట్లు చరుస్తూండగా — 'అమ్మయ్య' అనుకుంటూ క్రిందకు దిగింది దిగుతూ పడబోతే ఎవరో పట్టుకున్నారు ముందు నాలుగడుగులు వేసిన శ్రీపతి వెనక్కి వచ్చి విసుక్కున్నాడు అందరూ గొల్లున నవ్వేశారు

శ్రీపతి కళ్ళు నిప్పులు చెరిగాయి అతని పెదాలు వణుకుతున్నాయో తనను తిడుతున్నాయో అర్థం కాలేదు రాధకు

మళ్ళీ మామూలుగా టేబిల్‌మీద త్రాగుడు ఓ అరగంట వినలేని సంగీతం వికృతమైన అరుపులు గందరగోళం రాధకు తల తిమ్మిరెక్కింది ఏడవాలనిపించింది

ఆ తర్వాత టపాకాయలు పేలాయి అందరూ లేచి నిలబడ్డారు డ్యాన్సు చేసేవాళ్ళు చేస్తున్నారు త్రాగేవాళ్ళు తాగుతున్నారు సిగరెట్లు ఊరికే ఇస్తున్నారు పొగ,వాసన, చమట, వికృతంగా అరుపులు

రాధ తల తిరుగుతోంది

ఓ అరగంట ఆ సమస్యలన్నీ అలాగే ఉండగానే, మళ్ళీ తమ ఇద్దరి పేర్లూ చదివారు శ్రీపతి ఎగిరి గంతేస్తే — అందరూ తమనే చూశారు రాధకు ఏడుపు ఆగలేదు 'కర్చీఫ్' నోట్లో కుక్కుకుంది ఎదురుగా ఎవర్నో పరిచయం చేశాడు శ్రీపతి అతను సుతారంగా 'షేక్‌హ్యాండ్' ఇవ్వబోతే, చేతులు జోడించి నమస్కరించింది రాధ శ్రీపతి సంజాయిషీలో తను అమాయకురాలు అందుకే ప్రైజు వచ్చిందన్న పకపకలు !

శ్రీపతి బరబరా లాక్కుపోవటం రాధకు తెలియదు 'స్టేజి' మళ్ళీ ఎలా ఎక్కిందో తెలీదు ఎలా దిగిందో అసలే తెలీదు ఇంటికి కార్లో వస్తోందని మాత్రం తెలిసింది మంచినీళ్ళవుతున్నాయి ఆపమని డ్రైవర్ని తట్టింది సిగరెట్టు పొగ దట్టంగా పీల్చి వుండటంవల్ల "ఏమైందీ" — అన్న శ్రీపతి మాటల్నిండా పొగ పేరుకపోతే — దగ్గకుండా ఉండలేకపోయింది రాధ

శ్రీపతినిచూసింది కళ్ళనిప్పులు నోట్లోపొగ!

ఇంటికి వచ్చారు రాధ అలాగే తలపట్టుకుని సోఫాలో కూర్చుండిపోతే దగ్గరకొచ్చాడు తను సూట్ విప్పేసి లుంగీ బనీన్తో వున్నాడు

'ఇదిగో' అంటూ ఓ దళసరి కాగితాన్ని రాధమీద విసిరేశాడు అందులో వున్న ఇంగ్లీషు అక్షరాలుమెరుస్తున్నాయి రాధకి ఏమీ అర్థంకాలేదు

"ఏమిటిదీ ?" అడిగింది

"నువ్ నాకు తగిన భార్యవని పారిస్ హోటల్ వాళ్ళు ఇచ్చిన ఘనమైన సన్మానపత్రం"

ఎవరు ఎవరికి తగ్గవాళ్ళో, ఎవరు నిర్ణయించిందీ తెలుసుకుని పేలవంగా నవ్వింది రాధ

"పేడబుర్రలా ముఖం అంతా ఏడుస్తూ నిలబడితేనే, ఆ జడ్జీలంతా మెచ్చుకున్నారు నవ్వితే నీ సొమ్మేం పోయింది ?"

'నవ్వగలిగే వయసునూ, నాన్న సంపత్తినీ పొగొట్టుకున్నాన'ని రాధ మనసులోనే అనుకుంది

"ఏమిటే మాట్లాడవ్ ?"

"ఏం మాట్లాడాలి ?"

"మనం వెళ్లింది ఎక్కడకో తెలుసా ?"

ఎక్కడికని రాధ అడగలేదు గర్వంగా సిగరెట్

వెలిగించి శ్రీపతే చెప్పాడు

"పారిస్ హోటల్లోని 'మేడ్ ఫర్ ఈచదర్' కంటెస్ట్‌కి!"

"తెలుగులో చెప్పండి" రాధ అడిగింది

"అవును! నేను తెలుగులో చెప్తానూ — నువ్ తెలుగుతో ఏడుస్తూందు! తెలుగులో నవ్వనేది వుండేడిస్తే కదా?" అంటూ రాధవైపు కసిగా చూసి — "మనం వెళ్లినచోట అందరూ జంటలే కనిపించారు చూశావుగా?" అన్నాడు శ్రీపతి రాధ కళ్లల్లో పత్తి చేనుమీద గొంగళిపురుగులు గుర్తుకొచ్చాయి

"ఆ జంటల్లో మన జంట గొప్పగా వుందని మెచ్చుకున్నారు" శ్రీపతి చెప్పదలచుకున్నది పూర్తిచేశాడు

రాధ ఏమీ మాట్లాడలేదు కళ్లు మండుతున్నట్లనిపిస్తే ఒకసారి మూసుకుంది ఆమె ముభావాన్నీ ప్రవర్తననీ గమనిస్తున్న శ్రీపతి ఒళ్లు మండిపోతోంది —

"అయినా ఆకలేస్తే ఇంట్లో తిని రాకూడదూ? కళ్లు తిరిగి అక్కడ పడిపోతే — నా పరువు పోయింది నే వెనక్కి తిరిగి చూస్తే ఎవరి ఒళ్లోనో వున్నావ్" అన్నాడు "ఇంక నిన్ను జన్మలో ఎక్కడికీ తీసుకెళ్లను!" —

"నిజంగానా?" — ఆశగా అంది రాధ

"ఆఁ నువ్ ఛస్తే కాటికి కూడా!" —

రాధ లేచింది విసవిసా లోపలకు వెళ్లింది ఓ సీసా పట్టుకొచ్చింది దాన్ని శ్రీపతిచేతిలో పెట్టి —

"మీరు అక్కడికి వెళ్లేటప్పుడు మాత్రం దీన్ని తీసుకెళ్ళటం మరచిపోకండి!"

"షటప్" — ఆవేశంగా అరిచాడు శ్రీపతి

"నోరు మూయటం చాలా సులభం తెరచినప్పుడు సరిగా మాట్లాడటం సంస్కారం" —

"అవును! ఈసారి మీ నాన్న పంపుతానన్న పైకం రేపు కూడా రాకపోతే, నిన్నూ, నీ నోటినీ గదిలో మూసి తాళం వేస్తాను "మేనర్‌లెస్ బిచ్" అంటూ ఆ సీసా మూత తెరిచాడు శ్రీపతి

శ్రీపతి చేతిలో, సీసా మూత తిరగటం గమనించింది రాధ తన మెడచుట్టూ, దేవుని సాక్షిగా ఎప్పుడో బిగుసుకపోయిన గొంతులోని దుఃఖం, గ్లాసులోకి వంపుతున్న బ్రాందీ నవ్వులో కలిసిపోయింది

తన బ్రతుకు మూగవాడి వెక్కిళ్ళలావుంది!

**11**

డాక్టర్ మోహన్‌తో తనెప్పుడూ చనువుగా మాట్లాడలేదు దానిక్కారణం ఆయన ముభావమే! కొందరు మనుషులు అంత ముభావంగా ఎందుకుంటారో అక్కడ పరిస్థితి చూస్తే అర్థమైంది సూర్యానికి

అది సరోజినీదేవి కంటి ఆస్పత్రి

సర్వేంద్రియాణాం నయనం ప్రధానమనే నిర్వివాదాంశాన్ని కళ్లారా చూశాడు సూర్యం

కళ్ళజోడు పెట్టుకున్న చిన్న చిన్న పిల్లలలో ఎంతో పెద్దతనం చూశాడు

అవసరానికి మించిన శ్రమ చేసి అద్దాలు తెప్పించుకున్న యువకుల్ని చూశాడు

వయసు బలికోరే జవసత్వాలకు బానిసైన ఓ మాదిరి వయసులో ఉన్నవాళ్ళని చూశాడు

ఈ ప్రపంచంలో ఇంత చూసినా తనివితీరక, ఇంకా ఏదో చూడాలని తాపత్రయపడి, జారిపోతున్న కళ్ళజోళ్ళను సర్దుకుంటున్న ముసలివాళ్ళనూ చూశాడు

కానీ, ఆ ఆస్పత్రి బయట ఆనందంగా పాడుకుంటూ అడుక్కుతింటున్న పుట్టు గ్రుడ్డి బిచ్చగాడ్ని మళ్లీ ఓసారి చూడాలనిపించింది సూర్యానికి!

డాక్టర్ మోహన్‌కి స్వయంగా చెప్పవలసిన ఓ విషయం గురించి అక్కడకు వచ్చాడు సూర్యం 'మోహన్‌గారు ఆపరేషన్ థియేటర్లో ఉన్నార'ని తెలుసుకుని బయట, వీళ్లందర్నీ చూస్తూ గడిపాడు

అక్కడున్న 'ఔట్ పేషెంట్ క్యూ'లో ఎవరో — తాపెరిగిన పంచకట్టు! ఆత్రంగా దగ్గరకెడితే, 'అవునా కాదా' అన్న అనుమానం మరింత వచ్చిన మీసకట్టు ఆ వ్యక్తిలో, తనని గుర్తించిన చూపులకు, ఈ ఆస్పత్రి చికిత్స అవసరం లేదన్నంత పట్టు! అయినా అటు తిరిగిన ఆ వ్యక్తి వివరీతప్పు బెట్టు!!

"మావఁయ్యా" — పలకరించాడు సూర్యం

ఆ వ్యక్తి తల నిటు తిప్పి అదోలా చూస్తే — పేలవంగా నవ్వి తల దించితే — "క్షమించండి! మా వెంకట్రామయ్య మామయ్యేమో ననుకున్నాను" అని సూర్యం వెనుతిరిగాడు

ఆ మరుక్షణం తనని వెనగ్గావచ్చి రెండు చేతుల్తో పొదివిపట్టుకున్న మావయ్యలో పట్టుదల సడలినట్టుగా వింత జలదరింపు! "సూర్యం" అన్న ఎనలేని ఆప్యాయమైన పలకరింపు!

"మావఁయ్యా! ఎప్పుడొచ్చావ్? నేనిక్కడ వున్నానని తెలీదా? అసలీ ఆస్పత్రిలో ఎందుకున్నావ్? అత్తయ్య బావుందా?" ఎంతో హర్షంతో కురుస్తున్న ఆ ప్రశ్నలవర్షం తగిలి, వెంకట్రామయ్య కళ్ళు కూడా వర్షించకుండా వుండలేకపోయాయి తమాయించుకుని, అటు తిరిగి కళ్లు తుడుచుకుని 'సూర్యం బావున్నావా?" అని అడిగాడు

ఆశించని ఆప్యాయత ఏదో వెంకట్రామయ్య మాటల్లో ప్రతిధ్వనించింది!!

"రాధ నాకు రాసిన ఉత్తరంలో నువ్విక్కడ వున్నావని చెప్తే, ఎంత బాధపడ్డానో తెలుసా?"

"ఎందుకు మావఁయ్యా?"

"నీ క్షేమాలు నేను వినే యోగ్యత పోగొట్టుకున్నందుకు"

"పోనీలే మావఁయ్యా! అలా లోపలకు వెళ్లి కూర్చుందాం" అంటూ 'విజిటర్స్ రూం'కి తీసుకెళ్లి "అవునూ! ఆ 'క్యూ'లో ఎందుకున్నావ్ మావఁయ్యా!" అంటూ వెంకట్రామయ్య కళ్లల్లోకి పరిశీలనగా చూశాడు

అప్పటికే 'విజిటర్స్ రూమ్'కి చేరుకున్న వెంకట్రామయ్య సూర్యం కూర్చోగానే, తనూ అతని ప్రక్కన కూర్చోలేక బావురుమన్నాడు

సూర్యం కంగారుపడి "ఏమయింది మావఁయ్యా?" సూర్యం కంఠంకూడా గద్గదమైంది బీటలుకట్టిన వాళ్ల బాంధవ్యం కన్నీటితో తడిసింది

సూర్యం త్వరగానే తెప్పరిల్లుకున్నాడు "ఏమైంది మావఁయ్యా నీ కళ్లకూ?" అని మళ్లీ అడిగాడు

"నా కళ్లకా బాబూ? తనివితీరా ఏడ్వాలన్నా కన్నీరురాక, ఈ ఆస్పత్రికి వచ్చాను కానీ — రేయ్ సూర్యం! నేను వెతుక్కుంటూ రావల్సింది ఆస్పత్రికి కాక, నీకోసమని, ఏడుపొచ్చాక తెలిసింది నిన్ను చూడగానే నాకు నూపొనింది ఫరవాలేదు" పైమీది కండువాతో కళ్లొత్తుకున్నాడు వెంకట్రామయ్య

"అలా మాట్లాడతావేమిటి మావఁయ్యా? అసలు ఏమైందో చెప్పు? మనకు ఇక్కడ తెలిసిన డాక్టరుగారున్నారు అయినా ఒక్కడివే వచ్చావే? శ్రీపతికానీ రాధకానీ తోడొస్తే బాగుండేదిగా?" అడిగాడు సూర్యం

"రారు బాబూ! నాకెవరూ తోడురారు!



అసలు రానక్కర్లేదు ! నన్ను నాదారికి వదిలేసినా నేనంత బాధపడను కానీ, తాడుకట్టి ఈడ్చుకు పోతున్నార్రా ! అది సరేకానీ, నాన్న బావున్నాడా ?''

''బావున్నాడు మావయ్యా ! రాధ భర్తతో ఈ ఊళ్లోనే వుంటోందని పోయిన వుత్తరంలో నాన్నకి రాశాను ''

కళ్లు తుడుచుకుని, బెంగగా వింటూ — ''జవాబు ఏం రాశాడురా ?'' అని అడిగాడు వెంకట్రామయ్య

''ఏవుందీ ? నాకింత వయసొచ్చినా, ఇంకా చిన్నపిల్లాడ్నే అనుకుని — ''నీ మందలే అయినా రాధతో అంత మరీ చనువుగా తిరగకూ, అదీ — ఇంటిదగ్గర మరింత జాగ్రత్తగా వుండూ, కారణం లేకుండా నవ్వకూ' అంటూ మొదలెట్టి, 'అమ్మాయికో చీరైనా పెట్టావా' అని ఇంతే సంగతులతో ముగించాడు'' నవ్వుతూ బదులు చెప్పాడు సూర్యం

''వాడి ఆప్యాయతే అంత ! సుమతీశతకం ఇంకా మర్చిపోలేదు కాబోలు '' తను దూరం చేసుకున్నా యింకా దగ్గరౌదామన్న తాపత్రయంతో సతమతమయ్యే శేషగిరికి, రాధమీద అభిమానమింకా దూరంకాలేదని గ్రహించిన వెంకట్రామయ్య కళ్లు అశ్రుపూరితా లయ్యాయి

''ఏమిటి మావయ్యా మరీ అంత చిన్నపిల్లాడిలా !'' — మందలించాడు సూర్యం

''బాబూ సూర్యం చిన్నప్పుడు ''కళ్లు పోతాయిరా'' — అని నాన్న అంటే ఏమిటో అనుకున్నాను కానీ నా కళ్లు తెరచివుంచే నన్నా దేవుడు ఇలా హింసిస్తున్నాడు'' —

''అసలేం జరిగిందో చెప్పు మావయ్యా ! ఎందుకలా బెంబేలు పడిపోతావ్'' అంటూ ఎదురుగా వున్న 'డోర్ కర్టెన్'ని సర్ది, మళ్లీ వచ్చి కూర్చున్నాడు సూర్యం

''ఒరేయ్ సూర్యం ! నా నోటితో ఎందుకు చెప్పిస్తావ్ ఈ ఉత్తరం చూడు'' — ఓ ఉత్తరం తన లాల్చీ జేబులోంచి తీసి ఇచ్చాడు సూర్యానికి

అలికినట్లు అస్తవ్యస్తంగా ఇరికించి వ్రాసిన చేవ్రాత అక్కడక్కడ మరీ తడిసిపోయి అలుక్కుపోయినట్టున్న అక్షరాలు ! మొదట ''నాన్నా'' అని వ్రాసి వుంది అది రాధ వెంకట్రామయ్యకు రాసిన ఉత్తరమని ఆత్రంగా చదవడానికి ఉపక్రమించాడు సూర్యం అంతలో వెంకట్రామయ్య మళ్లీ దాన్ని ఒడిసిపట్టుకుని లాక్కుంటే అవాక్కయ్యాడు

మళ్లీ వస్తున్న కన్నీళ్లని బలవంతాన ఆపుకుంటూ'—

''రేయ్ సూర్యం ! నువ్ చదవద్దులేరా ! చదివితే నువ్వూ ఏడుస్తావ్ ! నువ్వేడిస్తే చూడలేనని మా నాన్నే అంటుండేవాడు ! నేను మాత్రం ఎలా చూడగలను ? చేసిన పాపం చెబితే పోతుందంటారు అందుకే నేనే చెప్తాను '' అని ఓ క్షణం ఆగి మళ్లీ ప్రారంభించాడు వెంకట్రామయ్య

''ఆస్తి ఐశ్వర్యంతో తులతూగే కుటుంబంలో రాధను ఇవ్వాలన్న నా గిర్వానికి శ్రీపతి కన్పించాడు దేవాలయానికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా వుంటున్న శ్రీపతి హృదయం ప్రసాదమంత పవిత్రమైందను

# మనుగడలో మలుపులు

కున్నాను అనుకున్న మరుక్షణం — మరేదీ ఆలోచించకుండా ఆ గుళ్లోనే వాళ్ళకు పెళ్లి చేశాను కానీ సూర్యం ! గుళ్లో పెళ్లి చేశానే కానీ — ఆ గుళ్ళో మరే గుండ్రాయి కిచ్చినా నా తల్లి సుఖంగా బ్రతికేదని తెలుసుకోవటానికి ఎన్నో నెలలు పట్టలేదు !''—

''శ్రీపతికేం మావయ్యా ? నిక్షేపంలా —''

వారించాడు వెంకట్రామయ్య ''నిధులూ — నిక్షేపాలూ ప్రాణం లేని రాతి దేవుళ్ళకిరా ! మనిషికి కావల్సింది పిడికెలంత హృదయం దేవుడ్ని తిడుతున్నాననుకోకుండా ఆలోచించు ! రాతి గుండె పోలిక నెందుకు తెచ్చుకోవాల్సివచ్చిందో నువ్వే చెప్పు !'' అంటూ ముగించాడు వెంకట్రామయ్య

సూర్యానికి విషయం పూర్తిగా అర్ధం కాకపోయినా, రాధ శ్రీపతితో సుఖపడటంలేదని గ్రహించాడు వాళ్ళ కాపురాన్ని తను చూసివుండవలసింది !

**బాతాఖానితో పక్కవారి పని పాడుచేయకండి ! అదే క్రమశిక్షణ**

శ్రీపతీ రాధా, ఓసారి తనను ఆహ్వానించినప్పుడు — ఓ ఆదివారం వాళ్లింటికి వెడితే — తలుపుకు తాళాలు వేసివున్నాయి ఆ తర్వాత ఈ అయిదారు నెలలలోనూ ఒకటి రెండు సార్లు వెళ్లినా తను ఎక్కువసేపు అక్కడ వుండలేదు

ఆలోచనలనుంచి తేరుకున్న సూర్యం — ''అసలు శ్రీపతి అక్కడెక్కడో దేవాలయానికి ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా పని చేసే వాడన్నావ్ కదా — మరి హైదరాబాద్ ఎలా వచ్చాడు మావయ్యా ?'' అని ప్రశ్నించాడు

''ఏం చెప్పను సూర్యం ? శ్రీపతికి గుర్రప్పందాల పిచ్చి అవి గడ్డి తినీ — వీడు బ్రాందీ త్రాగీ — మీ తాతయ్య నా కిచ్చిపోయినదాన్లో సగం ఆవచేశారు నేను వారించాను, బ్రతిమలాడాను — కాళ్లు పట్టుకున్నాను ! రాధ జీవితాన్ని ఎరగా చూపించి నన్ను బలహీనుడ్ని చేశాడు — కాదు — గాడిదకన్నా హీనంగా చూశాడు ! నేను మొరయిస్తే — అక్కడి హుండీలోని పైకాన్నంతా మూటకట్టుకుని — హైదరాబాద్ వచ్చి హారతి కర్పూరం చేశాడు అధికారులకి మంచి మాటలు చెప్పి — చెంపలేసుకుని — ఉద్యోగాన్ని మళ్లీ సంపాదించుకోవచ్చు — కానీ అప్రతిష్టను ఎలా తప్పించుకోగలడు చెప్పు ?'' — మావయ్య చెబుతూంటే — ఆ కళ్లల్లోకే చూస్తూ వింటున్నాడు సూర్యం

''తన అప్రతిష్టను నాకూ అంటగడితే తలెత్తుకోలేకుండా తిరుగుతున్నాను నా అడుగులు నేనే లెక్కెసుకున్నాను అప్పుడర్ధమైంది — నేను మీ అందరికీ ఎంత దూరంగా నడిచానో !''

''ఇంతకీ శ్రీపతి ఈ వూరు ఎలా వచ్చిందీ నువ్ చెప్పలేదు '' మళ్లీ అడిగాడు సూర్యం

''హుండీలో డబ్బంతా గల్లంతుచేస్తే అక్కడ ఉద్యోగంలోంచి సస్పెండుచేశారు లంచాలిచ్చి ఈ వూరు ట్రాన్స్‌ఫర్ చేయించేసరికి బరువు సగం తగ్గింది ఊరయితే మారాడుకానీ, మనసుమాత్రం మారలేదు వాడు పెట్టే అల్లరికి అదెక్కడ ఓర్చుకుంటుంది చెప్పు ? యిలా ఉత్తరాల్లో అది ఏడవటం — పనికట్టుకొనివచ్చి నేను ఓదార్చటం ఇదీ సంగతి !'' అంటూ ముగించి నిట్టూర్చాడు వెంకట్రామయ్య

''పోనీలే మావయ్యా ! ఏది ఎలా జరుగుతుందో ఎవరు చెప్పగలరు ? అంతా తీరిగ్గా మాట్లాడుకుందాం అదిగో డాక్టరుగారొస్తున్నారు'' అంటూ సూర్యం లేచి నిలబడ్డాడు

''హలో మిస్టర్ సూర్యం ! వాటీజ్ ది మేటర్ ? అయినా యీమధ్య మీరు మా యింట్లోంచి మకాం మార్చేశాక బొత్తిగా కనిపించటమే మానేశారు రండి ప్లీజ్ '' అంటూ ఆహ్వానించాడు డాక్టర్ మోహన్

సూర్యం నడుస్తూంటే వెంకట్రామయ్య అనుసరించాడు సూర్యానికి డాక్టరుగారిచ్చిన మర్యాద చూసి అవాక్కయిపోయాడు

''వీరు మా మావయ్య'' పరిచయం చేశాడు సూర్యం

నమస్కారం చేసిన వెంకట్రామయ్యకు ప్రతి నమస్కారం చేసి ''చెప్పండి'' అంటూ దగ్గరకొచ్చాడు మోహన్

''మరేం లేదులెండి ! ముందు అబ్బాయి పని చూడండి బాబూ ! నేను తర్వాత తీరిగ్గా వచ్చి నా కళ్లు చూపించుకుంటాను '' అని వినయంగా అన్నాడు వెంకట్రామయ్య

సూర్యం రాజారాంకి చెప్పవలసింది క్లుప్తంగా చెప్పాడు ఆ తరువాత మరికొన్నినిముషాలకే బయల్దేరి, వెంకట్రామయ్యను తన యింటికి తీసుకుని వెళ్లాడు

'ఇంటిదగ్గర నుంచి డబ్బు తెప్పించమని శ్రీపతి రాధను బలవంతంచేస్తే, రాధ ఏడుస్తూ ఉత్తరం రాసిందనీ, అందుకే, నాలుగురోజుల క్రితం తను అక్కడకు వచ్చాననీ — రాజుకూడా వచ్చాడనీ' చెప్పాడు వెంకట్రామయ్య 'ఈమధ్య తన కళ్లు కొంచెం మసకగా అయినట్టనిపిస్తూంటే, ఓసారి చూపించుకుందుకు హాస్పిటల్‌కు వెళ్లినట్టు కూడా చెప్పాడు మావయ్య చెప్పిందంతా విన్న సూర్యం మౌనంగా వుండిపోయాడు

ఆరోజు సాయంత్రం కాస్త స్థిమితపడిన తరువాత వెంకట్రామయ్యను రాజారాంగారింటికి తీసుకెళ్లాడు అక్కడున్న అందరితో ''మా మావయ్య'' ''మా మావయ్య'' అని పరిచయం చేస్తూంటే, అతని మనసులోని ఆప్యాయతకు ముగ్ధుడౌతున్న వెంకట్రామయ్య కాళ్లు గాలిలో తేలిపోతున్నాయి

ఆరాత్రి భోజనం చేస్తూంటే గంభీరంగా అన్నాడు సూర్యం — ''మావయ్యా! నువ్ చెప్పవలసిన దంతా చెప్పావ్ ! కానీ నేను చెప్పవలసిన ఓ ముఖ్య విషయంకూడా వుంది'' అని

''ఏమిటి బాబూ అది ?'' ఆత్రంగా అడిగాడు వెంకట్రామయ్య

''శ్రీపతిని మార్చి, రాధమ్మ కాపురం చక్కదిద్దే బాధ్యత నాది ! అంతవరకూ నువ్వూ, రాజూ నాదగ్గరే వుండాలి !'' వెంకట్రామయ్య నిలువెల్లా కదిలిపోయి 'బాబూ' అంటూ సూర్యం మీదకు ఒరిగిపోయి వెక్కిళ్లతో ఏడ్చాడు

[ఇంకా ఉంది

***[illegible] అయినా ప్రజా జీవితం [illegible] సాగిపో తూంది, విశాఖపట్నంలో దూరంగా కోరమండల్ వెండి మబ్బుల్ని అనంత విశ్వంలోకి పంపుతున్నాది***

చావుల మదుం దగ్గర సిటీబస్సు ఆగింది జనం ఎగబడ్డారు ఖాళీ లేదని పొమ్మంటున్నాడు కండక్టర్ 'రైట్' చెబుతూ బస్సు కదిలిపోయింది రొద చేసుకుంటూ

అవతల పేవ్‌మెంటు మీద కృంగి కృశించి పోయిన వృద్ధుడు దీనంగా అడుక్కుంటున్నాడు అతని జుత్తు వెండికన్నా తెల్లగా మెరుస్తోంది కళ్లలో దీనత్వం ప్రతిబింబిస్తున్నాది ఎవ్వరూ అతని వైపు చూడటంలేదు ఎవరి బ్రతుకు వారిది, జీవిత పోరాటంలో

అతను నడుస్తున్న ప్రజల వైపు ఆకలి కడుపుతో చూస్తున్నాడు ఆశల వూపిరిని పీల్చుకుంటూ చావుల మదుం రైలు బ్రిడ్జిమీంచి మెయిల్ రొద చేసుకుంటూ పోతోంది

కారులో అందమైన చిన్న చిన్న పాపాయిలు స్కూలు నుంచి గామోలు యింటికి పోతున్నారు ప్రతీ రోజూ ఆ కారును అతను చూస్తున్నాడు అలాంటి పిల్లలున్న కార్లను అతను చాలా చూస్తున్నాడు అతని కళ్లల్లో కన్నీటి చుక్క క్షణం నిల్చి రాలిపోయింది

దూరంగా ఏదో పెద్ద బ్యాండు మేళం ధ్వని దగ్గర కాసాగింది అతను నవ్వుకున్నాడు ఇటు వేపు వచ్చే సంబరాలన్నీ విలువ లేని సంబరాలే సంబరం దగ్గర పడిపోయింది పూల రథం మీద పూలతో నింపబడిన మృత శరీరం ఆకాశంకేసి కళ్లు మూసుకుని చూస్తున్న దృశ్యం! చుట్టూ మేళతాళాలు !! ఊళ్లో వున్న పెద్దమనుష్యు లంతా విచార వదనాలతో వెనక సాగనంపుతున్నారు

చావుల మదుం క్రింద నుంచి పూల రథం వెళ్లిపోతోంది

"చాలా ఉదార స్వభావుడండి పూరికి ధర్మదాత ఒకడు చనిపోయాడు ఎవరు పెట్టారో ధర్మయ్యగారని పేరు సార్ధకం చేసుకున్నాడు" అంటున్నాడొకడు

"ఔను మరి! స్వయంగా కష్టించి మెట్లెక్కి వచ్చి లక్షలు గడించినాయన ఆయనకేం మహారాజు పట్నంలో ఎన్ని పదవుల్లో వున్నా నిరాడంబర జీవి కొంత కాలం బ్రతికితే గొప్ప పదవుల్ని అలంకరించేవాడు" అంటూ నడుస్తున్నా డింకొక వ్యక్తి

ఆడుక్కుంటున్న బిక్షగాడు ఆ పేరు విన్నాడు

"బాబూ! ఆ చనిపోయిన వ్యక్తి కంట్రాక్టరు ధర్మయ్యగారే కదండీ!"

'ఔనయ్యా!' అన్నాడు ఇంకొక వ్యక్తి

ఊరేగింపు చావుల మదుం దాటిపోయింది

* * *

బిచ్చగాడి మస్తిష్కంలో మిల్లు రాల్చిన రంపం పొడిలా ఆలోచనలు

ఎన్నో సంవత్సరాల క్రితం తను అనకాపల్లిలో పని చేస్తుండేవాడు, గుమాస్తాగా చాలీచాలని జీతం ముగ్గురు పిల్లల సంసారం రోగంతో తీసుకుంటున్న తండ్రి ఇవన్నీ అతని షాతికేళ్ల జీవితాన్ని నలిపై యేళ్లకు తెచ్చాయి అయినా జీవిత పోరాటంలో తను అలసిపోలేదు ఆశ నిండిన మనస్సు, ఆశ

[illegible]

కాలనాగును సంహరించగలననే నమ్మకం తనలో వుండేది ఒక రోజు విశాఖపట్నం కేంపు వచ్చాడు తను పని చూసుకున్న తర్వాత సింహాచలం వెళ్దామని బస్సు ఎక్కబోయి చావుల మదుం దగ్గర క్రింద

(29వ పేజీ చూడండి)




బిన్నాడ శ్రీనివాసరావు
వేమకోట సీతారామశాస్త్రి





ANNOU

The Bonnie

for all who gurg

Gollywumps and ziggledi-dee ! A club for babies ? Yes, mothers, there's much more to The Bonnie Baby 'Club' than mere baby talk Specially created for sweet lovable babies, The Bonnie Baby 'Club' offers treats and goodies for your li'l one Absolutely free! With no strings attached!

**ELIGIBILITY FOR MEMBERSHIP** If you're expecting a baby in the next three months, or if your new one is not more than four weeks old, make him a member of The Bonnie Baby 'Club' sponsored by Glaxo. Don't you think that's something a baby would gurgle about ?

**FIRST BATCH OF APPLICATIONS WILL BE OPEN TILL MARCH 31, 1976**

**FREE!**

**ON BECOMING A MEMBER, YOU GET THE FOLLOWING:**

* **A booklet on baby care** to help you prepare for his arrival, and to look after him in the best possible way—as only a mother can.

* **A booklet on baby names** a wide choice of names, both modern and traditional

* **A baby diary** to keep on record, baby's progress from his very first day onwards






Interpub/GL/3/75

**FREE**

*As soon as baby is born : A tin of Glaxo Sunshine or Ostermilk (500 gms) — so baby can be bubblier, bouncier, livelier !*






**FREE** *When baby is three months old*

** A tin of Farex: the ideal weaning food—for health and growth.*

** A packet of Glaxose – D (100 gms.) the delicious energy-giver, for zest and zip !*






**FREE** *Baby Care Advice*

*Glaxo, specialı care, will be hı you on the gen and care of you*

**FREE GIFTS MUST BE C**
**Nagpur and Indore • NO**
**Patna and Gauhati • SO**
**Ernakulam, Trivandrum,**





'పెద్దన్నయ్య'లో ప్రభ, రంగనాథ్

### బడిపంతులు బ్రహ్మప్రయత్నం

ముప్పలనేని శేషగిరిరావు శ్రీ శ్రీనివాసా ఏజెన్సీస్ వారి "ప్రేమాయణం" చిత్రంలో బడి పంతులుగా అల్లురామలింగయ్య నటిస్తున్నారు. సైకిలెక్కడమంటే ఈ బడిపంతులుకు చాలా కష్టం. ఏదైనా ఎత్తు ఆసరాగా చేసుకునిగానీ, సైకిలెక్కలేడు పాపం. ఇంటినుంచి బయలు దేరేట్టయితే, బిండె సాయంతో సైకిలెక్కేస్తాడు. స్కూల్ కెళితే సైకిలెక్కడం కోసమనే ఒక ప్రత్యేక పుట్‌పాత్‌ను ఏర్పాటుచేసుకుని వుంటాడు.

ఒకసారి నడి రోడ్‌లో చిక్కుంటాడు. ఎక్కడా ఎత్తు కన్పించపోయేసరికి, ఏం చేయాలో తోచక దిక్కులు చూస్తుంటాడు. ఇంతలో కొంత దూరంలో పడుకునివున్న గేదొకటి కన్పిస్తుందతనికి. సరాసరి అక్కడికెళ్లి ఆ గేదెపై కాలూని, సైకి లెక్కి యింటికి చేరుకుంటాడు.

చిత్రంలో ఈ బడిపంతులు పాత్ర కన్పించినప్పుడల్లా మనం కడుపుబ్బ నవ్వుతాం. మొదటినుంచీ చివరివరకూ నవ్వుల జల్లులతో నింపేసారు రచయిత సముద్రాల. మహదేవన్ మ్యూజిక్, ఠాగూచౌదరి కెమెరా, కళాధర్ కళ, భక్తవత్సలం కూర్పు సమపాళ్లలో సమకూరిన ఈ చిత్రానికి పెండ్యాల నాగాంజనేయులు దర్శకత్వం వహిస్తున్నారు.

రాజబాబు, చంద్రమోహన్, రావుగోపాలరావు, అల్లురామలింగయ్య, నారాయణరావు, మాడా, రోజారమణి, హేమాచౌదరి, గిరిజారాణి ముఖ్య పాత్రధారులైన ఈ చిత్రానికి మూలం ప్రోలాప్రగడ సత్యనారాయణమూర్తి విరచితమైన "ప్రేమాయణం" నవల. అనిల్‌ప్రభాస్ ఎంటర్‌ప్రైజస్ ద్వారా ఈ చిత్రం విడుదల.

### ముప్పలనేనికి అక్కినేని ఆమోదం

"బలిపీఠం" చిత్ర నిర్మాతల్లో ఒకరు, "ప్రేమాయణం" చిత్ర నిర్మాత ముప్పలనేని శేషగిరిరావుగారు కలకత్తా వెళ్లి, అక్కడ విజయ ఢంకా మ్రోగిస్తున్న "సన్యాసిరాజా" చిత్రాన్ని దక్షిణ భాషలకు కొన్నారు.

## ★ సినిమా విశేషాలు ★

కొన్ని నాలుగు రోజులకు, ఆయన అక్కినేని గారిని భాగ్య నగరంలో కలిసి, కథను వివరించారు. "నటసామ్రాట్"కు కథ బాగా నచ్చింది గనకనే, ముప్పలనేనికి తన ఆమోదాన్ని తెలిపారు.

### సంకొత్త పాత్ర !

అక్కినేని ఎన్నో చిత్రాల్లో వైవిధ్యం వున్న పాత్రలను పోషించినప్పటికీ, "సన్యాసిరాజా" పాత్ర ఆయనకు కొత్తదే అవుతుంది.

అభిరుచి వున్న ముప్పలనేని, అక్కినేనిగారిని పొందడం అభినందనీయం.

### అక్కినేని చిత్రానికి
### పి. సి. రెడ్డి దర్శకత్వం !

చిత్ర చిత్ర ప్రవర్ధమాన మవుతున్న సుబ్బరాజు ఒక మంచి వార్త చెప్పారు.

'ప్రేమాయణం'లో హేమా, చంద్రమోహన్



అక్కినేనిగారి అంగీకారంతో, తన జీవితాశయం నెరవేరినట్లు, శ్రీ వాణి ఆర్ట్ కంబైన్స్ అధినేత ఆనందాన్ని వ్యక్తపరచారు.

వర్క్ వున్న దర్శకుడుగా ఎప్పుడో నిరూపించుకున్న పి. చంద్రశేఖరరెడ్డి అక్కినేని నటిస్తున్న చిత్రానికి దర్శకత్వం నిర్వహించే మొదటి చిత్రం సుబ్బరాజుదే అవుతుంది.

### సాలుకు రెండు చిత్రాలు

ప్రతి సంవత్సరం రెండు చిత్రాలు నిర్మించే శక్తి, పథకం సుబ్బరాజుకు ఆదినుంచి అలవాటే. ప్రస్తుతం రక్తపాశం, కొత్తవాళ్లతో చిత్రం నిర్మాణంలో వున్నాయి.

### సెక్రటరి తారాగణం

విఖ్యాత చిత్ర నిర్మాత రామానాయుడు తలపెట్టిన "సెక్రటరి" వర్ణ చిత్రాన్ని సంక్రాంతి పర్వదినాన రాష్ట్రపతి సతీమణి ప్రారంభించారు. భారత అధ్యక్షుడు, మన ముఖ్యమంత్రి, త్రిభాషా చిత్రాల అగ్రనాయకులు "సెక్రటరి" చిత్ర ప్రారంభోత్సవంలో పాల్గొన్నారు.

"సెక్రటరి" నవలను పదే పదే చదివిన పాఠకులు వేల సంఖ్యలో వున్నారు. ఆ నవల చదివిన వాళ్లు, ఆ పాత్రలకు ఎవరు న్యాయం చెయ్యగలరో ఎప్పుడో నిర్ణయించారు.

పాఠకులు ఎవర్నయితే వూహించారో, వాళ్లనే సురేష్ అధినేత ఎంపిక చేశారు.

రాజశేఖరంగా అక్కినేని, జయంతిగా వాణిశ్రీ, ప్రమీలగా జయసుధ, రేఖారాణిగా కాంచన, శివరావ్‌గా చంద్రమోహన్ నటిస్తున్నారు.

"సెక్రటరి" చిత్రానికి ఆత్రేయ, మహాదేవన్, ఏన్సెంట్, కె. ఎస్. ప్రకాశరావుగార్లు యస్సెట్‌గా వుండగలరు. సంవత్సరంన్నర తరువాత, అక్కినేని నటిస్తున్న సాంఘిక చిత్రం యిది. వసూళ్ళ గూర్చి వేరే చెప్పాలా !

# "సోగ్గాడిది మావూరే"

**శోభన్ బాబు**

**మావూరు** ఈకాలపు వూరు కాదు. ఆ కాలపు వూరు. తరాలు మారినా అంతరాలు మారని పాతకాలపు పల్లెటూరు. కరెంటు యింకా రాక పోయినా కరెంటుక్కూడా అందని వెలుగు మా ఊరంతా కళకళలాడుతూంటుంది.

ఆంధ్రప్రదేశ్‌లో ... కృష్ణాజిల్లాలో...విజయ వాడ తాలూకాలో ... మైలవరం ఫిర్కాలో ఓ చిన్న గ్రామం మా ఊరు. 'చిననందిగం' దాని పేరు!

చుట్టూ వాగులూ, సస్యశ్యామలమైన పచ్చని పొలాలు. నడిబొడ్డున ఓ చిన్న రామాలయం, దాని చుట్టూ చిన్ని చిన్ని మరీ చిన్ని యిళ్లు ... ఎన్నో తాటాకుల కుటీరాల మధ్య నాలుగైదు పెంకుటిళ్లు ... యిదీ మా ఊరు ... అలాంటి ఓ పెంకుటింట్లో, ఓ సంక్రాంతి పర్వదినాన నా తల్లి నాకు జన్మ యిచ్చింది.

## పల్లెలో పదహారు వసంతాలు

ఆ పచ్చని పొలాల మధ్య, ఆ వెచ్చని మనసుల మధ్య పదహారు వసంతాలు యిట్టే గడిచిపోయాయి. మధురాతి మధురమైన ఆ కాలం ఏనాటికీ మరువ లేను. అది అమూల్యమైనది. రైతులు పొలాలకు వెళ్ళే ప్రాతఃకాలపు హడావిడీ ... రకరకాల వేషాలతో భుక్తి కోసం ప్రాకులాడే బిచ్చగాళ్ళు ... కులాంతరాలు కూడ మరచిపోయి బాబాయనో, మామా అనో, తాతా అనో వరసలు కలుపుకుంటూ కలుపుగోలుగా ఒక్కటిగా బ్రతికే ఆ అమాయకుల మధ్య నేనా పదహారు సంవత్సరాలూ పొందిన అనుభూతి నాటికీ నేటికీ ఏనాటికీ మరపురానిది.

అట్లాంటి మా చిన్న గ్రామం "చిన నందిగామ"లో కూడ ఓ 'సోగ్గాడు' వున్నాడు. అందరికీ ఆ సోగ్గాడంటే ఓ సరదా! అతనికి సరదాలంటే మహాసరదా!! క్రీజువెన్ను లేకుండా కాలు క్రిందపెట్టడు. నోట్లో భారెడు చుట్ట లేకుండా పెదవి కదపడు. బజారు దాటి బయటి కెళ్ళాలంటె గుర్రం. అది సకిలించిందంటే ఊరు ఊరే మార్మ్రోగుతుంది. అంత బలం పెడతాడు దానికి. బట్ట నలగనివ్వడు. తల చెదరనివ్వడు. ఎవరినీ దేనికీ అర్థించడు. చేతిలో వేయడమేగాని చేయి చాచడం అతని కలవాటు లేదు. సంక్రాంతి వచ్చిందంటే మా సోగ్గాడి సరదాలకు అంతుండదు. కోడిపందాలు, ఎడ్లపందాలు, బుర్రకథలు ... ఒకటా ... ఎన్నో ఎన్నెన్నో సంబరాలతో మా ఊరికే క్రొత్త కళ తీసుకొస్తాడు. పొందికైన అతని మొఖానికి కోటేరులాంటి ముక్కు కూడా పొదిగా డేమో ఆ భగవంతుడు, ఆ చుట్టుప్రక్కల గ్రామా లన్నింటికీ అతనే అందగాడు. ఊరూ వాడా అతనే సోగ్గాడు! కళకళలాడుతుంటాడేమో, ఎప్పుడూ ఓ పదిమంది ఆయనచుట్టూ వుండాల్సిందే. ఎక్క డుంటే అక్కడ నవ్వుల సెలయేరు గలగలా పారాల్సిందే. ముక్కు ఎంత సూటిగా వుంటుందో మాటకూడా అంత సూటే! కుండ బద్దలు కొట్టినట్టు మాట తీరు. న్యాయం విషయానికి వస్తే దేముణ్ణి దెయ్యాన్ని యిద్దర్నీ ఒకేగాటికి కట్టేస్తాడు. సుప్రీంకోర్టుకూడా అందని తీర్పు చెబుతాడు. మాట యాసగాని మనసు మహా తిన్ననైనది. ఎంతో తీయనైనది. అందరికీ అందుకే అతనంటే ఎంతో యిష్టం.

ఇంతా ఎందుకు చెబుతున్నానంటే ఆయన నాకు బాబాయ్ అవుతాడు. చిన్నప్పట్నించీ పిల్ల లందరిలోకీ నన్నే ఆయన దగ్గరకు తీసుకొనేవాడు. నేనూ చిన్న సోగ్గాడిలాగా అందంగా ఆయనలాగే వుండేవాడినేమో నన్నసలు వదిలేవాడు కాదు. మ్యాట్ వేసినప్పుడల్లా ఆయన ప్రక్కనే కూర్చో బెట్టుకునేవాడు. అందుకే మా బాబాయ్ అంటే నాకెంతో ఇష్టం. ఆ పాత్రను ఎలాగైనా ప్రజల ముందుకు తీసుకురావాలని ఎంతో ఉబలాటం నాకు. అదొక తపనైంది. నాలుగైదు నాటకాలు వేశానుగాని అలాంటిపాత్రదొరుకలేదు. కోరిక కోరికగానే మిగిలింది.

## వేషం కోసం తాపత్రయం



నాటకాల వయసు వెళ్ళి రిగా సినిమాల వయ సైంది. రకరకాల వేషాలు వస్తున్నాయ్. సంవత్స రాలు గడిచిపోతున్నాయ్. సినిమాల్లోకి వచ్చి అప్పుడే పద్నాలుగు సంవత్సరా లయింది. అయినా 'మా బాబాయ్ – అదే మా ఊరి 'సోగ్గాడి' వేషం యింకా దొరకలేదు. చిన్ననాటి కల తీరలేదు. అలా లోలోపలే ఆ తపన రాజుకుంటున్న ఓ ఉదయం ప్రముఖ నిర్మాత శ్రీ రామానాయుడు గారు ఫోన్ చేసి ఆ రాత్రి వారింటికి 'డిన్నర్'కి రమ్మని ఆహ్వానించారు. అరుదైన మిత్రులలో ఒకరైన నాయుడుగారు పిలిచారు గాబట్టి పార్టీలకు వెళ్లే అలవాటు లేకపోయినా వెళ్లాను.



డ్యాన్సులూ, సూప్‌లూ మధ్య నాయుడుగారు ఒక తమిళ రచయితను పరిచయం చేశారు. పరిచయం కూడ పూర్తిగాకుండానే 'బాలమురుగన్' గారు 'స్క్రిప్ట్'తో సహా కథ చెప్పడం ప్రారంభిం చారు. మొదలెట్టడమే 'సోగ్గాడు' కథానాయకుడు పేరు అన్నారు. అదిరిపడ్డాను. తస్సాదియ్యా... యీ సోగ్గాడు... మా చిన్నాన్న కాదుగదా... అను కుంటూనే ఉన్నాను. చెప్పనే చెప్పారు. సోగ్గాడిది ఒక పల్లెటూరు అని! సంతోషం వెల్లువలై కట్టలు తెంచుకుంది. టైటిల్ సోగ్గాడు... అతని దొక పల్లెటూరు!! అంతకంటే ఏం కావాలి. ఆ పాత్ర ఎలాంటిదైనా ఫరవాలేదు. కథ ఏ కథైనా ఫరవా లేదు. చిన్ననాటి కల, చిరకాల కోరిక తీరే మహత్తర అవకాశం! బాలమురుగన్‌గారు చెప్పుకుపోతూనే ఉన్నారు. కాని నేనూ నా మనసూ అక్కడ లేము. మా ఊరి సోగ్గాడు నా కళ్ళల్లో మెదులుతున్నాడు. కవిగారు చెబుతూనే ఉన్నారు. ఆయన చెప్తున్నది నేను వింటున్నది కాదనీ, నేను వింటున్నది ఆయన చెబుతున్నది కాదనీ కవిగారికి అర్థమయ్యిందేమో వారి కంచు కంఠం జీరపోయింది. కొంతసేపటికి మాటకూడ పడిపోయింది. వారి కథ నాకు నచ్చ లేదేమో వారి పాత్ర నా కిష్టం లేదేమో... మరి తద్వారా వారికి వచ్చే పది వేలో యిరవై వేలో పోతాయికదా అని నీరుకారిపోయారు కవిగారు. వారు చెబడం ఆగిపోయేసరికి నేను నా ఊహాలోకం నుంచీ యీ లోకానికి వచ్చాను. "సార్... మీకు కథ నచ్చలేదా?"

## పెల్లుబికిన ఆనందం

కవిగారు నసిగారు మూగవోయిన వీణలాగా. ఆ కాస్సేపటిలో నేను విహరించిన ఊహాలోకాలన్నీ

వర్ణించి, అలాంటి పాత్ర వేయటం నా చిరకాల వాంఛ అని కవిగారికి చెప్పాను. వారి ఆనందానికి అవధి లేదు. ఉత్సాహానికి వంతెన కట్టాల్సొచ్చింది. దిగ్విజీకృతమైన ధీమాతో విజృంభించారు మళ్లీ కథ చెప్పడం. బహుశా అంత బాగా మళ్లీ వారెప్పుడూ చెప్పలేరేమో! అన్ని పాత్రలూ నటించి, అన్ని పాటలూ పాడి, నృత్యాలు కూడ వేయడానికి ప్రయత్నించి మమ్మల్నందరినీ మూడు గంటలసేపు మంత్రముగ్ధుల్ని చేశారు శ్రీ బాలమురుగన్‌గారు! కథ పూర్తి కాకుండానే వారిని కౌగలించుకున్నాను. అద్భుతంగా ఉందని చెప్పాను. రామానాయుడుగారిని ప్రక్కకు తీసుకునివెళ్లి 'అన్ని భాషలకూ సంబంధించిన హక్కులను తీసిపెట్టుకోమని' సలహా యిచ్చాను. కథ విన్న సంతోషం నా కడుపు నింపింది. 'డిన్నర్'కి న్యాయం చెయ్యలేకపోయాను. నాయుడు గారిని క్షమించమని కోరాను సెలవ్ తీసుకుంటూ!

నా సలహా ప్రకారమే నాయుడుగారు అన్ని భాషలకు సంబంధించిన సోగ్గాడి హక్కులను స్వాధీనం చేసుకున్నారు. ఎదురులేని ఘనవిజయంతో వీరవిహారం చేస్తున్న నేటి మన తెలుగు సోగ్గాడు, రేపు తమిళ సోగ్గాడై, ఎల్లుండి హిందీ సోగ్గాడు కూడ అవుతాడు.

## ఎంతటి అనుభూతి!

రోజూ షూటింగ్ నుంచి వచ్చేసరికి నా టేబిల్‌మీద వందవరకూ అభిమానుల ఉత్తరాలు వుండడం పరిపాటైపోయింది. 'సోగ్గాడు' చిత్రం చాలా బాగున్నదనీ పల్లెటూరి నిక్కచ్చి నైజాన్ని ప్రస్ఫుటంగా చూపగల్గాననీ, నా నట జీవితంలో గర్వించతగ్గ విజయం అనీ అభిమానులు అభినందన వర్షం కురిపిస్తున్నారు. ఆ ఉత్తరాలు చదువుతున్నప్పుడల్లా మా బాబాయ్ సోగ్గాడు నా కళ్లల్లో మెదులుతున్నాడు. కళ్ళు చెమర్చుతాయ్ కృతజ్ఞతతో!

మీకు చెప్పిన ఈ సత్యం యింతవరకూ మా బాబాయ్‌కి కూడ చెప్పలేదు. అయితే యిప్పుడు మూడు కోరికలు మొలకెత్తాయి.

ఒకటి — మా బాబాయ్‌ని ప్రక్కన కూర్చోబెట్టుకుని 'సోగ్గాడు' సినిమా చూడాలి. ఆయన పొందుతున్న అనుభూతుల్ని చూసుకుంటూ నేను మురిసిపోవాలి. సినిమా పూర్తయింతర్వాత మా బాబాయ్ కౌగిలింతలో నేను ఉక్కిరిబిక్కిరైపోవాలి.

రెండు — 'సోగ్గాడు' శతదినోత్సవ సభలో మా ఊరి సోగ్గాడు — మా బాబాయ్‌నికూడ ప్రజా బాహుళ్యానికి పరిచయం చేయాలి!

మూడు — నా చిన్ననాటి కోరికను నేను కోరకుండానే తీర్చినందుకు శ్రీ రామానాయుడుగారినీ, నా కృషిని అభినందించి మా సోగ్గాడిని ఆశీర్వదించిన మీకూ నా కృతజ్ఞతలు "సోగ్గాడి శతదినోత్సవ వేడుకలలో" ప్రత్యక్షంగా చెప్పుకోవాలి.

మీ సోగ్గాడు శోభనాద్రి

# సినిమా

## ఎన్టీఆర్ అపూర్వ నటన!

ఆదిత్య చిత్రవారి "మనుషులంతా ఒక్కటే" వర్ణ చిత్రం తెలుగు చలనచిత్ర రంగంలో పెద్ద సంచలనం సృష్టించగల అర్హతను బడసియుంది. ఈ చిత్రంలో ఎన్టీఆర్ ద్విపాత్రాభినయం సర్వజన ఆకర్షణీయం కాగలదు.

తండ్రిగా నందమూరి గొప్పగా నటిస్తే, తనయుడుగా తారక రామారావు ప్రజల మెప్పును పొందే విధంగా నటించారు. ఎన్టీఆర్‌తో పోటీపడి సత్యనారాయణ నటించారు. నాయిక పాత్రలను జమున, మంజుల పోషించారు.



'పుణ్యంకొర్డి పురుషుడు'లో జయంతి

## హాస్య రసం!

"మనుషులంతా ఒక్కటే" చిత్రంలో అల్లు... రమాప్రభల హాస్యం ప్రేక్షకులను కడుపుబ్బ నవ్విస్తుంది. "బుర్రకథ సామ్రాట్" బెనర్జీ చేసిన 'అభిమన్యు కథ' అందరినీ జలదరింపచేస్తుంది.

దాసరి సంభాషణలు, గడుసరి దర్శకత్వం 'నువ్వా... నేనా' అన్నట్టుగా వున్నాయి. ఆర్ట్ డైరెక్టర్ రాజేంద్రకుమార్ సమర్పిస్తున్న "మనుషులంతా ఒక్కటే" చిత్రానికి దుద్దు వెంకటేశ్వరరావు, మహేష్ నిర్మాతలు.

## జనామోదంపొందే పాత్రలో కృష్ణ

"మనసు—మాంగల్యం, దీక్ష" చిత్రాలను నిర్మించిన కోగంటి కుటుంబరావు తన మూడవ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించడానికి నిర్ణయించి, హీరో పాత్రకు కృష్ణను ఎంపిక చేశారు.

జనామోదం పొందే కొత్త తరహా పాత్రను కృష్ణ పోషిస్తున్నట్టు, లత—ప్రభ ఆయన సరసన నటిస్తున్నట్టు పద్మజా మూవీస్ అధినేత చెప్పారు.

## మహదేవన్-రావ్!

అనుభవజ్ఞులయిన సి. ఎస్. రావ్ దర్శకత్వాన్ని, మహదేవన్ సంగీతాన్ని నిర్వహించే యీ వర్ణ చిత్రానికి భమిడిపాటి రచన్ను, ప్రకాష్ ఛాయాగ్రహణాన్ని సమకూర్చగలరు.

చిత్రం ఆద్యంతం ప్రకృతి శోభలతో విలసిల్లే అందాల ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతుందని, కుటుంబరావు చెప్పారు.

నాయకుడు కృష్ణ అయితే, గుమ్మడి, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య, మాడా సహాయకులుగా నటిస్తున్నారు.

## ఏడురీళ్లు పూర్తయిన త్రివిక్రమరావు చిత్రం

విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ పతాకంక్రింద టి. త్రివిక్రమరావు నిర్మిస్తున్న వర్ణ చిత్రం యిప్పటికి 7 రీళ్లు పూర్తయింది. ఈ చిత్రం మూడవ షెడ్యూల్ ఫిబ్రవరి 20 నుంచి 29 వరకూ అవుట్‌డోర్‌లో జరుగుతుంది. జనవరి, ఫిబ్రవరి నెలల్లో చిత్రంలోని మరో మూడు పాటలను రికార్డు చేయాలనుకుంటున్నారు నిర్మాత త్రివిక్రమరావు.

శోభన్ వెరైటీ వేషధారణ చేస్తున్న ఈ చిత్రంలో పోలీస్ ఆఫీసర్‌గా ప్రభాకరరెడ్డి, అతని తనయగా మంజుల నటిస్తున్నారు. నాయకుడికి ప్రతినాయకుడిగా రావుగోపాలరావు కన్పించే ఈ చిత్రంలో జయసుధ, రోజారమణి, అంజలీదేవి, శ్రీదేవి, సత్యనారాయణ, రాజబాబు, అల్లు రామలింగయ్య, శ్రీధర్, సాక్షిరంగారావు, సత్యేంద్ర కుమార్ ప్రధాన తారాగణం.

మహదేవన్ సంగీతం, జి. కె. రాము ఛాయ, సత్యానంద్ సంభాషణలు, కుదరవల్లి కళ సమకూరుస్తున్న ఈ చిత్రానికి టి. కృష్ణ దర్శకుడు. లక్ష్మి విడుదల.

— శ్రీనివాస్

(23వ పేజీ తరువాయి)

పడ్డాడు. దాని వెనకాతలే వస్తున్న మోటారు సైకిలు సడన్ బ్రేకుతో ఆగిపోయింది. ఆ మోటారు సైకిలు మీద వ్యక్తే ధర్మయ్య. తను మనస్సులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. అలా ప్రారంభమయ్యింది ధర్మయ్యతో తన పరిచయం.

కాలం ఎవరికోసం ఆగుతుంది. మొక్కగా పెరగడం ప్రారంభించిన తమ స్నేహలత పెరగడం ప్రారంభించింది. కుటుంబ స్నేహంకూడా ఏర్పడింది. తనకు అదృష్టవశాత్తూ విశాఖపట్నం ట్రాన్సఫర్ అయింది.

ధర్మయ్య కాస్త కలిగిన కుటుంబం. అయినా అతను ఆ యింటికి పెంపకంకి వచ్చాడు. జ్ఞాతులకి, దాయాదులకి అతనంటే పడదు. తింటూ కూర్చుని మోటారుసైకిలు మీద తిరిగే ధర్మయ్యకు ఒక వ్యక్తిత్వం రావాలని తను ఆరాటపడ్డాడు. మెల్లిగా కాంట్రాక్టులు అతనిచేత పెట్టించడం ప్రారంభించాడు. అలా ధర్మయ్య జీవితం తన కళ్లముందే పెరిగింది అలా అనడంకన్నా ధర్మయ్య జీవితాన్ని తను పెంచేసేడని చెప్పుకోవచ్చు పట్నంలో పలుకుబడి గూడా తెచ్చిపెట్టేడు తను

తనకి జీవితంమీద ఎన్నో ఆశలున్నాయి ధర్మయ్య కూతుళ్ళు, కొడుకుల్లాగే తన ముగ్గురు పిల్లలు కారులో వెళ్లి కాన్వెంటులో చదువుకోవాలని, తన స్నేహితుని జీవితం ఉన్నత మార్గంలో పయనిస్తుంటే తన జీవితంగూడా ఉన్నత మార్గంలో పయనిస్తుందని తను ఆశించాడు కాని తనకి లభించేదేమిటి ? నిట్టూర్చాడు తను

* * *

బేండుమేళం రాను రాను దూరం అయిపోతోంది తనూ రెండడుగులు ముందుకు వేశాడు మెల్లాగ గతం జ్ఞాపకం వచ్చింది రాను రాను తన పరిస్థితి మరీ అధ్వానం అయిపోయింది అతని పరిస్థితి ఎంత మెరుగుపడుతుందో తను అంత దిగజారిపోయాడు తన తండ్రి చనిపోయాడు పక్షవాతంతో మందు యిప్పించలేని పరిస్థితి ఏర్పడిం దందువలన తన పిల్లలకు కడుపునిండా తిండి, సరియైన బట్టలు ఇవ్వలేని దీనావస్థలో నున్నాడు తను

"ఏమండీ! ధర్మయ్యన్నయ్య నడిగి యేదైనా కొంత సహాయం పొందితేగాని మనకీ దరిద్రం నుండి విముక్తి కల్గదేమోనండీ!" అంది తన సహభాగిని అనూరాధ

తను నిర్లిప్తంగా నవ్వాడు

"నీకు తెలీదు అనూ! స్నేహంలో స్వార్థానికి తావివ్వకూడదు స్నేహం యొక్క ఫలితం స్వప్రయోజనానికి వినియోగించుకుంటే అది స్నేహం కాదు చూద్దాం అతనంతట అతనికి ఆ వుద్దేశ్యం కలిగితే ఫర్వాలేదు మనకీ మంచి రోజులు రాకపోవు" అనేవాడు తను

అనూరాధ ఇంకేమీ మాట్లాడలేకపోయేది

ఊహించని ఎత్తుకు పెరిగిపోతే వ్యక్తి ఆరాటపడిపోతాడు అలాగే అయ్యింది, ధర్మయ్య పరిస్థితి యింకా ఎత్తుకు పెరిగిపోవాలనే దురాశ అతనిలో పెరిగిపోయింది అతనిలో వుండే కాస్త నీతిని, నిజాయితీని ఆ దురాశ నేలమట్టం చేసింది స్మగ్లింగ్ ప్రారంభించాడు

ఒకనాడు అకస్మాత్తుగా అతని పరువు ప్రతిష్ట పోలీసులకు చిక్కిపోయి సర్వనాశనమయ్యే సమయంలో తన సహాయం అర్థిస్తే, స్నేహ ధర్మం కోసం కేవలం తను ఆదుకున్నాడు దానికి ప్రతిఫలంగా వుద్యోగం పోయింది ఆరు సంవత్సరాలు కఠిన శిక్ష చెప్పారు

అశ్రుపూరిత నయనాలతో తను స్నేహితుని వేపు చూసాడు తను జైలుకి వెళ్లిపోతూ

"నా కోసం, నా పరువు కోసం నీ జీవితాన్నే బలి చేశావు రఘూ! నీ భార్యను, నీ బిడ్డల్ని నా కుటుంబంతో సమానంగా పెంచుతాను పిల్లల్ని కాన్వెంటులో జాయిన్ చేస్తాను" అంటూ చేతిలో చెయ్యి వేశాడు ధర్మయ్య ఆ రోజు తాను ఎంతో పొంగిపోయాడు

అలా రాజమండ్రీ జైల్లో ఆరు సంవత్సరాలు కఠిన శిక్ష అనుభవించాడు తను మొదట్లో ఒకటో ఆరో ఉత్తరాలు ధర్మయ్య నుంచి, తన భార్య నుంచీ వచ్చినా తర్వాత రావడం మానేశాయి తనేమీ ఆందోళన పడలేదు తన బిడ్డల భవిష్యత్తు కోసం తను ఆవేదనంతా భరించాడు జైల్లో తనకి విచిత్రమైన కలలు వచ్చేవి కాడిలాక్ కారులో తన పిల్లలు, ధర్మయ్య పిల్లలు ముచ్చటైన యూనిఫారంతో స్కూలు కెళ్తున్న దృశ్యం, పిక్నిక్ వెళ్తున్న దృశ్యం

తన భార్య దేవుని పూజా మందిరంలో తన విడుదల కోసం తపిస్తూ ప్రార్థిస్తున్న దృశ్యం ఇవన్నీ కన్పించేవి

అనుకున్న శిక్ష కంటే ముందుగానే విడుదల చెయ్యబడ్డాడు తను ఎంతో ఆత్రుతగా విశాఖపట్నము వచ్చాడు, తను ఈ ఆరు సంవత్సరాలలో విశాఖపట్టణము ఊరు మారింది

ధర్మయ్యగారి పొట్టి మేడ పెద్ద మేడ అయ్యింది పిల్లల్ని భార్యని చూడాలన్న కోరిక తనని ఆకలిదప్పుల్ని కూడా లెక్క చేయకుండా చేసింది విశాఖ చేరేటప్పటికి రాత్రయింది ధర్మయ్యగారింటికి రిక్షాలో వచ్చాడు తను

## యువతరం

ఆంధ్రా లయోలా కాలేజీలో బి. ఏ. చదువుకుంటున్న జె. వెంకటేశ్వరరావు ప్రస్తుతం విడుదలయిన చలనచిత్రాలు సంఘానికి ఉపయోగించేవిగా లేవు అంటున్నాడు. అక్కినేని అంటే యిష్టంట. లైబ్రరీలో "టైమ్" "న్యూస్‌వీక్" లాంటి మాగజైన్‌లు చూస్తాడు. మంత్రు చూడాలని సర్దా. నాటకాలు కూడా విరివిగానే చూస్తాడు. సైకిల్ పైన తిరుగుతుంటాడు. అమ్మాయిలచేత పరాభవం యిష్టంలేదు. వారిని ఏమీ ఏడిపించడంకోసం లనడు దిన పత్రికలు చదువుతాడు. టికెట్‌లు అందవన్న అపనమ్మకముంటే టికెట్‌లు యితర మార్గంలో సంపాయిస్తాట్ట! (ఎంతమాట!) హరిశ్చంద్రుడు యిష్టమేగాని ఆయన్ని అన్నివేళలా అనుసరించాలి అంటేనే కష్టమట! ఇతనికి బాడ్మింటన్ అభిమానం గల ఆట సాధారణంగా బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోవాలనే కృషి చేస్తూనే- కేవలం జనరల్ నాలెడ్జి కోసం రాజకీయాలు తెలుసుకుంటానని చెప్పాడు జె వెంకటేశ్వరరావు



అంటే చాలా యిష్టం అని చెప్పిందిగాని మరి ఎందుకనో చాలా సన్నంగా వుంటుంది బి యస్‌సి ఫస్టుక్లాసులో ప్యాసైంది. అంతటితో వూరుకోక బియ్యీడీకూడా అయింది. తెనాలి, గుంటూరులలో చదువుకున్నదికాని, బళ్లో టీచర్‌గా చేరి పాఠాలు చెప్పటం అంటే ఇష్టం లేదు. అందుకని ఎం. ఏ. ఇంగ్లీష్ పరీక్షలకు తయారవుతున్నది. మహాలక్ష్మికి ఆడంబరంగా వుండటం సర్దా లేదు. సింపుల్‌గా వుంటుంది. పాటలంటే వినడం యిష్టం. 'వీణ' సాధన హాబీ. సినిమాలు చూస్తుందికాని అభిమాన నటీనటులు ఎవ్వరూ లేరు.



కీట్స్ పొయిట్రీ, హిందీ రచయితలలో మైథిలీశరణ్‌గుప్త అంటే గౌరవం — అంటుంది కదా ? బుద్ధుడు చాలా గొప్పవాడని అంతా ఒప్పుకుంటారు కాని, యశోధర ఎంత త్యాగం చేసిందీ అన్నది ఎవ్వరూ గుర్తించరేం ? అంటుంది మైథిలీగారు యశోధర అనే రచనలో ఆమె దుఃఖాన్ని ఎంతో బాగా తెలివిడి చేశారట! ఓసారి వాళ్ల కాలేజీకి ఆనాటి రాష్ట్రపతి గిరిగారొస్తే వీళ్ల ఆనందానికి అవధుల్లేకుండా పోయాయిట

చిన్న చిన్న కథలు రాస్తుంది "మార్క్స్" చదువుతుంది — రచయిత్రి అవుతుందో లెక్చరర్ అవుతుందో — మరి కాలమే చెప్పాలి

**వ్యాస రచన పోటీ ముగింపు తేదీ : 20-2-'76**

తున్నాయి. గదిలో ఎర్రటి వెల్వెట్ క్లాతు నేలమీద పరచబడింది. దానిమీద రౌండు టేబిల్ చుట్టూ ఖరీదైన కుర్చీలు, టేబిలు నిండా బ్రాందీ విస్కీలు, ఎవరో పెద్దమనుషులు ధర్మయ్యతో తాగుతున్న దృశ్యం తనకి కనబడింది. నవ్వులతో గది మార్మోగి పోతోంది.

తను కేక లేద్దామనుకున్నాడు. కాని సభ్యత అడ్డు వచ్చింది.

పార్టీ మజాగా సాగిపోతోంది. పార్టీలో ఎవరికీ ఒంటిమీద చైతన్యం లేదు. పార్టీలో ఒకాయన.

"కాను బ్రదర్ ధర్మయ్య అన్న పేరు ఎవరు పెట్టేరోగాని చాలా అందంగా వుంది. పేరుకు తగ్గట్టే దానధర్మాలు చేసి పుణ్యం సంపాదిస్తున్నావ్" అన్నాడు.

ధర్మయ్య బిగ్గరగా నవ్వాడు. "పుణ్యంకాదు బ్రదర్! పేరుకోసం ధర్మంచేస్తున్నాను. ధర్మాత్ముడన్న పేరుతో ఎలాగైనా సలామ్ కావాలి." అన్నాడు.

"అవును! నీకో ఫ్రెండుండాలి. అతను యిప్పుడెక్కడున్నాడు బ్రదర్!"

"ఏ ఫ్రెండు?" ధర్మయ్య ముఖం ఆశ్చర్యార్థకంగా వెలిగింది.

"అదేనయ్యా! ఆ పొట్టిగా, బలంగా వుండేవాడు. సైకిలుమీద మీ యిద్దరూ వస్తూండేవారు."

"ఓహో! వాడా! పాపం! పూర్ క్రీచర్. ఈ డబ్బులేని వాళ్ళందరూ అకస్మాత్తుగా గడ్డి తిని గొప్పవాళ్ళు అయిపోవాలనే దురాశకు లొంగిపోతారు. వాడు అలాగే గడ్డి కరిచేడు. అప్పటికీ నేను జడ్జికి చెప్పి శిక్ష తగ్గింపించేను. లేకపోతే పది సంవత్సరాలు పడవలసిన శిక్ష ఆరు సంవత్సరాలకు తగ్గింది."

ఈ మాటలు వింటున్న తనకి కోపంవచ్చింది.

"నీయడా! నేను గడ్డికరిచానా?" అన్న గర్జన గొంతుకలోనే వుండిపోయింది.

ధర్మయ్య చెప్పుకుపోతున్నాడు.

"అప్పటికీ ఏదో స్నేహితుడు గదాని ఏదో సహాయం చేసాను. కాని అతని భార్యకు కోరికలు లావైపోయాయి. రెండు మూడు నెలలు పోయిన తర్వాత పొమ్మన్నాను బ్రదర్!" అంటూ ధర్మయ్య విస్కీ సిప్‌చేశాడు.

"అయితే వాళ్ళు ఎక్కడికి పోయారు బ్రదర్!"

"ఏమో ఎవరికి తెలుసు? బ్రదర్! వాడి పెళ్ళాం వుంటుంది రంభలాగ ... కాని ఎంత బలవంతపెట్టినా లొంగలేదు. ఉరిపోసుకుని చచ్చి పోతానంది.'

ఇంక వినలేకపోయాడు తను.

ఇంత నిక్రుష్టుడా! తన చేతుల పిడికెళ్ళు బిగుసుకుపోతున్నాయ్. ఒళ్ళు రౌద్రంతో కంపర మెత్తింది. తన బంగారుకలలని, భవిష్యత్తుని భగ్నం చేసిన వాణ్ణి గొంతుపిసికి చంపాలనిపించింది. కాని చంపలేకపోయాడు తను.

పిల్లలకోసం, భార్యకోసం అన్వేషణ సాగించాడు. సరియైన ఆచూకీ దొరకలేదు. తీవ్రమైన మానసిక వ్యథతో తను చాలాచోట్ల తిరిగాడు.

ఒకనాడు బెజవాడలో పేవ్‌మెంటుమీద తన భార్య బిచ్చగత్తె రూపంలో కనుగొన్నాడు. అప్పటికే ఆమె దీర్ఘరోగి. ఎముకలు గూడుకట్టుకుపోయి కళ్ళల్లో ప్రాణం నింపుకుపోయి వుంది. తన సహధర్మచారిణి అనూరాధ.

"పిల్లలు ఏరీ! అనూ!" అని తను అడిగాడు, గాద్గదికంగా.

ఆమె భోరున రోదిస్తూ "ఇంకెక్కడి పిల్లలండీ! అందరూ చచ్చిపోయారు. కలరాలో చచ్చిపోయారు. ఇంక నేను మిగిలిపోయాను." అంది దీనంగా.

"అసలేం జరిగింది అనూ!" అన్నాడు తను.

ఆమె ఒంటిమీద చిరుగులు చీర అస్తవ్యస్తంగా వుంది.

"మీరు జైలుకెళ్ళిపోయిన తర్వాత ధర్మయ్యగారు ఒకటికి రెండుసార్లు వచ్చారు. నన్ను బలవంతం చేశారు. నేను తిట్టాను. తర్వాత మరి ఆయన కన్పించలేదు. పిల్లల్ని రెండు మూడు సార్లు యింటికి పంపినా పొమ్మని కసిరేశాడు. అలా

అద్దె యివ్వలేదని యింటివాళ్ళు సామానుంచుకుని యింటినుంచి తగిలేశారు. ఒకనాటి నడిమధ్యాహ్నం వీధిలో దిక్కులేని పక్షులై నిలబడిపోయాం. తర్వాత ఎలాగో బ్రతకాలనుకున్నాం. ఎలాగూ బ్రతకలేకపోయాం. పిల్లలు కలరావచ్చి చనిపోయారు. కానీ నన్ను భగవంతుడు తీసుకెళ్ళలేకపోయాడు." అంటూ రోదించింది. తనూ అనూరాధ కలిసి ఎంతోకాలం బ్రతకలేదు. భార్య పోయిన తను పిచ్చివాడైపోయాడు.

దేవుని చివరి పిలుపుకోసం తను ఎదురు చూస్తూ వున్నాడు. అతను చిత్రంగా తనలో నవ్వుకున్నాడు. తన కన్యాయం చేసిన ధర్మయ్య ఏం తీసుకుని వెళ్ళిపోతున్నాడు. చావుల మయుంకి అతనూ కదిలాడు.

అతనికి గుండెల్లో సన్నగా పోటు ప్రారంభమైంది. ఆ బాధలోనే అతను లుంగలు చుట్టుకుంటూ మెల్లగా శ్మశానంకి చేరుకున్నాడు.

శ్మశానంలో గంధపు చెక్కలు పేర్చారు. శ్మశానం అంతా రాజకీయనాయకుల ఉపన్యాసం వినడానికి వచ్చిన శ్రోతలతో నిండిపోయినట్లు నిండి పోయింది.

పెద్దలందరూ పూల గుచ్ఛాలు మృత శరీరం మీద పెడుతున్నారు, ఒక్కొక్కరూ వచ్చి. అతనికి ఏడ్పు వచ్చింది. తొలినాటి స్నేహపు స్మృతులు అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసాయి. ఎంతో స్వచ్ఛంగా ఆశలు పెంచుకున్న తమస్నేహంకు ఐశ్వర్యం, అంతస్తు, అధికారం నాగుపాముల్లా క్రూరంగా కాటువేశాయి.

"బాబూ! నాకు రెండు పూలిప్పించవూ?" అన్నాడు వొణుకుతున్న కంఠంతో.

ఒక పెద్దమనిషి అసహ్యంగా అతన్ని చూసి నాల్గు పువ్వులు ఎత్తి చేతిలో పడేశాడు. అందరితో పాటు అతనూ కదిలాడు.

బలంగా వస్తున్న గుండెపోటుతోపాటు సమీపించాడు. చేతిలో పువ్వులు వేసి నేయకమునుపే అతనికి స్పృహ తప్పిపోయింది. అంతే ... అతను మరి లేవలేదు. జీవితపు సరిహద్దులను వెతుక్కుంటూ వెళ్ళిపోయాడు.

"అయ్యో! పాపం" అన్నారు సానుభూతిపరులు. ధర్మయ్య చితిపేర్చగా మిగిలిన కర్రలతో యింకొక చితి పేర్చబడింది.

మంటలు ఉవ్వెత్తున లేచాయి. చితి కాల్తోంది కసిగా. సముద్రంమీద నుండి వీచే గాలిని కౌగిలించుకుంటోంది. ఎర్రటిగా ఏడుస్తున్న సూర్యుడు సముద్రంలో కృంగిపోతున్నాడు. గాలితో పోటీ పడుతున్న మంటలు మాత్రం మనిషి ఎప్పటికైనా మంటల్లో కలవాలనే చావని నిజాన్ని చాటి చెప్తున్నాయి.



అమెరికా ద్విశత వార్షికోత్సవ సందర్భంగా వాషింగ్‌టన్ డి. సి. లోని జాన్ ఎఫ్. కెన్నెడీ కేంద్రంలో ప్రదర్శింపబడిన హాస్య నాటకం "ది స్కిన్ ఆఫ్ అవర్ టీత్"లో నటి ఎలిజబెత్ యాష్లే.

# పూలతో స్నానం చేస్తున్న అనుభూతి కోసం

MCA/J/Tel

స్నానానికి
మహత్తరమైన సబ్బు
కేవలం రూ. 1.47 పై.
(స్థానిక పన్నులు అదనం)




గవర్న్‌మెంట్ సోప్ ఫ్యాక్టరీ, బెంగుళూరు వారి నాణ్యమైన ఉత్పాదన

మార్కెట్ చేయువారు: మైసూర్ సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు.

బాలం వెలగలేరు:

చలం తనుసృష్టించిన సమాజానికి ప్రేమ పూర్తిగా పోశాడు, ప్రేమకు గొప్ప ఉన్నతమైన స్థానాన్నిచ్చాడు నీతికి అసలు అర్థం ఇచ్చి సత్యం చెప్పాడు.. ఉన్నమాటంటే పుడుకెందుకా? భర్తముసుగులోంచి మరొకర్ని ప్రేమించే భార్య లేచిపోతే అవినీతి భర్తకి తెలియకుండా ప్రేమాయణం సాగిస్తే అది నీతినా? ఇదంతా తెలిసే చలాన్ని ఎందుకు బహిష్కరిస్తుంది సంఘం? చలం మీద మీ అభిప్రాయం?

ఇంత అభిప్రాయం మీరు చెప్పేశారుగా. చాలు స్వేచ్ఛాప్రణయం ప్రబోధించిన చలం. మీకు దైవత్వం చూపించాడనుకుంటే— మరి "హిప్పీ నాగరికత"నెందుకూ అసహ్యించుకుంటున్నారు? చలాన్ని సంఘం బహిష్కరించలేదు. బహుశా వారే తాను సృష్టించిన సమాజం నుంచి దూరంగా పారిపోయారేమో?!

వి. జె గొల్లమూడి

ఏ స్త్రీకి ఆస్తి ఎక్కువో, ఆ స్త్రీకి గర్వం ఎక్కువ?

ఎంతేగామరి? ఏ మగవాడికి ఐశ్వర్యం ఎక్కువో అతగాడికి ఆడది ఆటబొమ్మలా కన్పట్టం లేదా? సాటిస్త్రీ మనిషిగా కనపడని ఆ—మనిషి తత్వం గర్వంకాదా? !

# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

ఏమ్. ఎస్. ఆర్ హైద్రాబాదు.

ఆడవారికీ మగవారికీ మధ్య దూరం ఎంతో తెలుసా? పుట్టినింటికి మెట్టినింటికి వున్నంత— అంటే ఎంత వెనుకబడి వున్నారో

చిత్తం మరసలు పుట్టిల్లు వదలని మగవాడు కాపస్తమండాకమనేగా అర్థం?! మెట్టినింట స్థిరపడ్డ పురుషుడెంత దూరం నడిచారు ?... . చూడండి యిలాంటి చొప్పదంటు ఆలోచనలకి స్వస్తి చెప్పండి ఆడా—మగా కలిస్తేనే— సంపూర్ణ వ్యక్తి— లేక పోతే— యిద్దరికిద్దరూ—సగం — సగం

ఆర్ వి. ఎల్. పెదవాడపల్లి.

పెళ్ళి అయ్యేవరకు తలిదండ్రుల అడుగుజాడల్లో, పెళ్ళయ్యాక భర్త అడుగుజాడలో నడిస్తే యికస్త్రీకి స్వేచ్ఛ ఎపుడు?

చెప్పకుంటున్నారు. అడుగుజాడలో గుడ్డిగా నడవక పోవడమే స్వేచ్ఛ. మీకు తగిన దారిని చెప్పడమే స్వేచ్ఛ తోలుబొమ్మలాకాకుండా తనకినచ్చి. తెలిసి వూపుతే—అదే స్వేచ్ఛ.

కె ఆర్. విద్యానగరు

నా తొలి నవల మీకే అంకితం యివ్వాలని వుంది

అందుచేత సీరియల్‌గా వేయించి, అచ్చు వేయించి, ఆపై అంకితోత్సవం ఏర్పాటు చేసుకోమంటావా చిట్టితల్లీ. అంత కీర్తికండూతి ఇంకా పట్టి పీడించడం లేదు నన్ను!

కె పి ఆర్. మంగళగిరి

మీరూ, 'బీనాదేవి', రంగనాయకమ్మ కలిసి తెలుగు సినిమా తీస్తే ఎలా వుంటుందంటారు?

అద్భుతంగా వుంటుంది డబ్బు పెట్టేవాడుంటే. బీనారావుగారు రాస్తారు. రంగనాయకమ్మగారు చీల్చి చెండాడుతారు నేను దూరంగా కూర్చుని పద్దులు రాసి నిర్మాత కాళ్ళా కడుపూ పట్టుకుని సద్దుకు పొమ్మంటాను ముందు పిక్చరు పూర్తి కానివ్వండి సెన్సార్ల కాళ్ళు తరవాత పట్టుకుంటాను' అంటాను ఎందుకో తెలుసా పాపం పూర్తిగా నష్టపోయేది నిర్మాతే! ●

# హైదరాబాద్ నోట్ బుక్

అజ్ఞాత సహజకవి భల్లమూడి

రామాయణం జరిగిందా, లేదా, రాముడు మనిషా దేవుడా అని పరిశోధనపారీణులు ఒక వైపు పోరాడుతుండగా, దేశంలో రామకథలు పుడుతూనే వున్నాయంటే విడ్డూరం కదూ! రాముడైతేనేం, రావణుడయితేనేం మనకు కూడుపెడుతుందా, గుడ్డ




కడుతుందా అని వూరుకోబుద్ధి కాదు మానవునికి మంచి ఎక్కడున్నా స్పందించడం మనసున్న మనిషి లక్షణం కనుకనే 80 ఏళ్ళ శ్రీ భల్లమూడి వేంకట సూర్యనారాయణమూర్తి గారు వంశస్థ వృత్తంలో సంస్కృత రామాయణం తన నిత్యపారాయణం కోసం గానం చేశారు. వంశస్థ వృత్తం జ, త, జ. ర, గణాలతో నడుస్తుంది మదీయవంశస్థ మతే న్మయా నమ' అనే మకుటం ఉన్న ఈ వంశస్థ రామాయణం 164 శ్లోకాలు. సరళమైన శైలి. అక్కడక్కడ కొంచెంగా చమకులు మిథిలకు వచ్చిన విశ్వామిత్ర రామ లక్ష్మణులను జనకుడు చూచి ఒకే మారు మూడు ఋతువులు ఎండకాలం, వానాకాలం శరత్కాలం వచ్చాయనుకున్నాడట

క్రమాత్ స పశ్యన్ జనక స్సమాగతాన్
తపంచ గాధేయం అమంస్త ప్రావృషం,
య మాప్త విద్యుద్ఘనభంచ సస్మితం
సుశారదం లక్ష్మణ మాత్త శారదం.

మూర్తి గారు శ్రీకాకుళం జిల్లాలో వంశధారా నదీ తీరంలోని కుద్దిగాంవ్ గ్రామ వాస్తవ్యులు. చిన్ననాడు ఆకుండిలక్ష్మణ శాస్త్రిగారివద్ద నౌడూరి నరసింహశాస్త్రిగారి వద్ద కావ్యాలు చదివారు. తమ గ్రామంలో సంస్కృత పాఠశాల పెట్టి చాలకాలం నడిపించారు సంపన్న గృహస్థులు కనుక చేయి చాచకుండా జీవితం గడుపుతున్నారు మనో వినోదానికి సంస్కృత సాహిత్యాధ్యయనం, కవితాను ఇంత చక్కగా కవిత చెప్పినా ఏదో సేవ అని, ఉద్ధారం అని పెద్ద పెద్ద మాటలు చెప్పని పెద్దరికం "ఆధునిక పరిస్థితులను గురించి కూడా వ్రాయండి" అని కోరాను. 'ఈ వయస్సులోనా ?" అన్నారు "రామాయణం ఈ వయసులోనే కదా వ్రాశారు?" అన్నాను 'భగవంతుడు ఆయురారోగ్యాలిస్తే ప్రయత్నిస్తాను అన్నారు. 'మంచిని పెంచడానికి ఒక్క చుక్కయినా గొప్పదే' అన్నాను. 'భీష్ముడు ఆదర్శప్రాయుడు గనుక, యువకులకు అనుసరణీయుడు గనుకఅతని చరిత్ర వ్రాయాలని ఉంది" అన్నారు. ఈ ముసలాయన వ్రాస్తారు మాట తప్పరు.

సాలార్‌జంగ్ మ్యూజియం సప్తాహం

సుప్రసిద్ధమైన సాలార్‌జంగ్ మ్యూజియం జనవరి 9 నుంచి 15 వరకు వారోత్సవం జరిపింది కళలపైన ప్రసంగాలు, చర్చలు కవిసమ్మేళనాలు జరిగాయి 11వ తేదీన రెవిన్యూ బోర్డు సభ్యులు శ్రీ ఎన్ రమేశన్ అధ్యక్షత న "కళా శిక్షణలో మ్యూజియం పాత్ర" అనే విషయంపై జరిగిన సదస్సులో

శియుతులు ప్రొఫెసర్ పరమాత్మాశరణ, జగదీశ మిత్తల్, డాక్టర్ సరోజినీ రేగానీ, నగరాభివృద్ధి సంస్థ అధ్యక్షుడు డాక్టర్ బావా, డాక్టర్ పై. యాదగిరిరెడ్డి, మునీంద్రజీ, తిరుమల రామ

## హైదరాబాద్ నోట్ బుక్

చంద్ర, చిత్రకారుడు లక్ష్మాగౌడ్ ప్రసంగించారు. సాలార్ జంగ్ మ్యూజియం చేయవలసిన కర్తవ్యాన్ని సూచించారు

సంస్కృత నాటక ప్రయోగ రంగం అవిష్కరణ.

సంస్కృత నాటక ప్రయోగం దేశంలో ఎప్పుడు, ఎవరు జరిపించారనే వివరాలు తెలిపే "సంస్కృత నాటక ప్రయోగ రంగం" అనే గంథాన్ని జనవరి 7వ తేదీన డాక్టర్ బి. రామరాజు గాంధి జ్ఞానమందిరంలో జరిగిన సభలో ఆవిష్కరించారు. ఈ గ్రంథాన్ని శ్రీ వోగేటి అచ్యుతరామశాస్త్రి రచించారు. సమావేశానికి అధ్యక్షత వహించిన మంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి సంస్కృత నాటక రంగ సముద్ధరణకు ఉద్యమంగా పూనుకోవాలని, దీనికి ప్రభుత్వం తోడ్పడుతుందని అన్నారు. ఈ సందర్భంలో ఆధునిక సంస్కృత నాటకరంగ శతాబ్ది మహోత్సవ సంఘాన్ని శ్రీ టోకర్మలాల్ జీకాపడియా ప్రారంభించారు. డాక్టర్ మార్కండేయశాస్త్రి, డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు ప్రసంగించారు.

ఉపశ్రుతి :—

"ఏం సార్ ! మీ వూరి రోడ్లు మరమ్మతయిన ట్లేనా?" అనడిగాను ఒక పల్లెటూరి పెద్దమనిషిని. "ఎందుకు తొందర? ఇప్పుడేగా అఖిలభారత రోడ్ల మహాసభ జరిగింది. ఆ సూచనలపై చర్చలు జరగాలి. ఉపసంఘాలు ఏర్పడాలి. అవి నివేదికలు ఇవ్వాలి. ఆ నివేదికలపై పరిశీలన కావాలి. తర్వాత అధికారుల దృష్టి పడాలి ఉత్తర్వులు జారీ కావాలి ఇంత యినా, డబ్బు ఉండవద్దా!?.," అని ఇంకా ఏమో చెప్పబోయాడు "అయ్యా మీరు చెప్పే లోగా మరమ్మత్తు అయ్యేట్టుందే!" అన్నాను

—తిరుమల రామచంద్ర

# రాత్రి విహార సమయంలో మజ్దా...







## దీర్ఘ కాలం వస్తుంది, ప్రకాశవంతముగా నిలుస్తుంది.

చీకటి పడ్డాక నగరములు మరియు పట్టణముల రహదారుల మీద భద్రతన్నది అత్యాధునికమైన లైటింగు ఏర్పాటుపై ఆధారపడి యున్నది. ఇల్లాంటి క్లిష్టమైన ఆవరణలలో మజ్దా మూడు ప్రయోజనములతో వ్యత్యాసములను కలుగచేసి దృఢ పరచును—

మొదట సరియైన వాట్టేజి మరియు అందువలన ప్రకాశవంతమైన లైటింగ్. రెండవది దృఢమైన నిర్మాణం చాలా దీర్ఘ జీవనాన్ని కలుగ చేయును. మూడవది సరియైన ఎలక్ట్రిసిటీ యూనిట్లు ఖర్చు అగుట, మరియు అందువలన విద్యుత్ యొక్క అతిక్లిష్ట పరిస్థితులలో ఎక్కువ పొదుపు.

వీటన్నిటి వెనుక—మజ్దా యొక్క సరియైన లోప రహితమైన తయారీ తప్పులకు తావియ్యదు.

మజ్దా ల్యాంప్ కంపెనీ లిమిటెడ్

**అధిక కాంతికీ, ఎక్కువ జీవనముకు అది తప్పక**

# మజ్దా

THORN గ్రేట్ బ్రిటన్ థరన్ గ్రూప్ యొక్క ఒక సభ్యులు




**మా** వారి పేరు సుమన్ బాబు పెళ్ళికి ముందాపేరు విని వంకుల జుత్తుతో, చక్రాల్లాంటి కళ్ళలో, బెల్ బాటమ్ వేసుకున్న సౌందర్య రూపాన్ని ఊహించుకున్నాను ఆయనేదో థీసిస్ సబ్మిట్ చేసే గొడవల్లో ఉండటంవల్ల, సదరు సుమన్ బాబుగారి తండ్రిగారు — మా నాన్నగారు బాల్యస్నేహితులు కావడంవల్ల పెళ్ళిచూపులు తతంగం లేకుండానే మా మూడు ముళ్ళ ముచ్చటకి ముహూర్తాన్ని నిర్ణయించేశారు ఆ నిర్ణయం చేసిన ముహూర్తానికి నా ఊహాలోకంలోని రాజకుమారుడిలా కాక బట్టతలతో, చెవికొక కాడతో, లొట లొటా ప్యాంటుతో, 'బాంబుషెల్' లని ముద్దుగా పిలవబడుతున్న సుమన్ బాబు నా జీవితంలోకి ప్రవేశించాడు

కాలేజీ నుంచి వస్తూనే 'ఆశా' అని పిలుస్తూ ఎంతో అనురాగంలో నన్ను దగ్గరకు తీసుకొని మల్లెపూలని నా సిగలో తురుముతారని, స్కూటర్ వెనుక కూర్చోబెట్టుకుని 'జయ్' మంటూ సినిమాలకనీ, పార్కులకని తీసికెళ్తారని ఎంతో ఆశపడ్డాను కాని చెమటలు క్రక్కుతూ కిర్రు కిర్రు మంటున్న డొక్కు సైకిల్ని అతి కష్టంమీద త్రొక్కుకుంటూ కాలేజీ నుంచి వస్తున్న శ్రీవార్ని చూడగానే నా ఉత్సాహమంతా జావగారిపోయింది

శ్రీ వారితో సినిమాకెళ్ళాలన్న వెధవ కోరికొకటి నాకు కలిగింది కాని నాకుగా నేనే బయటపడి అడిగేకంటె ఆయనే ఆ పని చేస్తే బాగుంటుందని ఎంతో ఆశతో రోజులు దొర్లించ సాగాను ఆయన మాత్రం ఆదివారం వచ్చిందంటే చాలు బామ్మగారితో కబుర్లు చెప్తూ గుగ్గిళ్ళు తింటూ కూర్చుంటారే గాని నే నంటూ ఒక మనిషి నున్నానన్న సంగతే మర్చిపోతారు ఇహ మౌనానికి తావు లేదనుకుని, కాలేజీ నుంచి వచ్చి డబుల్‌కాట్ బెడ్‌మీద [అది మా కన్నవారిచ్చిందే లేండి] అపర శ్రీహరిలా పడుకుని కెమిస్ట్రీ బుక్ చదువుతున్న శ్రీవారి చెంతకు చేరి, నడినెత్తి మీద మిగిలున్న నాలుగు వెంట్రుకలు ఎక్కడూడిపోతాయోనని అతి జాగ్రత్తగా లాలనగా నిమురుతూ 'మనస్సులోని మాట బయటపెట్టాను' అంతే!! ప్రక్కన బాంబు ప్రేలినట్లుగా ఉలిక్కిపడి లేచి కూర్చుంటూ "ఏమిటి ?" అనడిగారు విషయం చెప్పాను. ఎలాగైతేనేం చివరకా జడపదార్ధంలో చలనం కలిగింది

"ఏ సినిమా కెళ్దాం" అనడిగారు

శ్రీవారితో కలిసి చూసే మొదటి సినిమా గనుక ఎ సి హాలులోచూడాలని నాఅభిప్రాయం. అందుకే డీలక్స్‌లో ఆడుతున్న "హరే రామ హరే కృష్ణ" సినిమా కెళ్దామన్నాను. అంతలో ఈ మాట లెలాగోగాని వంట చేస్తున్న బామ్మగారి చెవిన పడ్డాయి అంతే!! వంట ఇంట్లోంచి పప్పు మెదుపుతున్న తెడ్డుతోపాటు టి టి ఎక్స్‌ప్రెస్‌లా బెడ్ రూమ్‌లోకి దూసుకొచ్చేసిన బామ్మగారు "ఒక్క అరగంట ఆగండర్రా వంట తయారవుతుంది" అన్నది భోజనాలు చేసి వెళ్ళమంటుంది కాబోలనుకుని "వచ్చిన తర్వాత భోంచేస్తాంలెండి" అన్నాను

"అదిగాదే అమ్మాయ్ సినిమాజూసి చాలా సంవత్సరాలయింది అందులోనూ రామ కృష్ణుల సినిమా అంటున్నారు నేనూవస్తా" నన్నది

అంతే!! నా గొంతుకలో పచ్చి వెలక్కాయ పడింది అది రామకృష్ణుల సినిమాగాదు, "దమ్‌మారో దమ్" సినిమా అని చెప్తే చివాట్లుగాదు గడ్డి పెడ్తుంది 'హా హత విధీ!' అనుకుంటూ కుప్పలా కూలిపోయాను.

సరిగ్గా అదే సమయంలో, "అదిగాదే బామ్మా, నిన్నూ సినిమాకి తీసికెళ్దామనుకున్నాను, కాని అన్ని రోజులూ మన రోజులు గావు. ఏ దొంగన్నా ఇది పసిగట్టాడంటే

తాతయ్యి పెద్ద చెంబు మొదలు ని ఫాను వరకు ఎత్తుకుపోతాడు'' అంటూ అపర సైంధవుడ్లా అడ్డుపడ్డారు మావారు తాత గారిగుర్తుగా బామ్మగారికి మిగిలున్న మురుగు లన్నా పెద్దచెంబన్నా ఆమెకు పంచప్రాణాలు. అందువల్లనే శ్రీవారి మాటలు పాశు పతాస్త్రంలా ఆమెపై పనిజేశాయి.

''అదీ నిజమేనురోయ్'' అంటూ పప్పు గుత్తితోపాటు వంట ఇంట్లోకి ప్రయాణం కట్టింది.

హాట్సాఫ్ శ్రీవారికి. బట్టతలలో కెమిస్ట్రీ ఈక్వేషన్లు మాత్రమే ఉన్నాయనుకున్న నా అభిప్రాయాన్ని అర్జంటుగా తుడిచేసుకోక తప్పలేదు ప్రేమతో ఆ బట్టతల మీద 'టింగు' మని ఒక మొట్టికాయ వేద్దామను కున్నానుగాని, బెజ్జం పడుతుందేమో ప్రోగ్రాం క్యాన్సిల్ అవుతుందని పోస్టుపోన్ జేశాను. ఎలాగైతేనేం సినిమాకి బయలుదేరాము తీరా వాకిట్లోకి వచ్చామో లేదో ఆటోరిక్షా ఒకటి వచ్చి ఇంటిముందాగింది. అందులో నుంచి సతీ సమేతంగా దిగిన శ్రీవారి కొలీగ్‌ని చూడగానే మా సినిమా ప్రయాణం కంచికి ప్రయాణం కట్టింది

* * *

శ్రీవారు కాలేజీకి వెళ్ళగానే ఈ జీవితాని కిక 'ముద్దూ మురిపెం' లేదనుకుని ఆవేళే వచ్చిన వీక్లీ తిరగేస్తూ కూర్చున్నాను ఒంటి గంట ఆ ప్రాంతంలో వచ్చిన శ్రీవార్నిజూసి ''ఏమిటీవేళ కాలేజీ లేదా'' అనడిగాను. ''నాకు వర్కు లేదులే త్వరగా బయల్దేరు, సినిమా కెళ్దాం'' అన్నారు

'ఈ మాటలన్నది ఈయనేనా!' అని ఆశ్చర్యపోయాను కాని నేను ఆశ్చర్యాన్నుంచి తేరుకోక పూర్వమే ఆయన బాత్‌రూమ్‌లోకి దారితీశారు ఎలాగైతేనేం పావు గంటలో ముస్తాబై సినిమాకి బయలుదేరాం నిన్నటిలా పరిచితులు కనిపిస్తారని శ్రీవారు తొందర పెట్టడంవల్ల రిక్షాలో వెళ్ళటం ఇష్టం లేకున్నా మార్గాంతరంలేక ఈసురోమంటూ రిక్షా ఎక్కాను రిక్షా అర ఫర్లాంగు దూరం వెళ్ళిందో లేదో కాలేజీ కుర్రవాడొకడు మా శ్రీవార్ని విష్ చేశాడు అంతే!! ఉన్న ఫళంగా శ్రీవారి ఛాతి ఆరు అంగుళాలు పెరిగిపోయింది. ఫలితంగా సీట్లో ఆయన ప్రక్కన కూర్చోడం నాకు కష్టమయింది. చిద్విలాసంగా చిరునవ్వులు చిందిస్తూ

# మావారూ నేనూ సినిమా

''అతను నా స్టూడెంట్... అతనేగాదు నా స్టూడెంటెవరికైనా నేనంటే గౌరవం'' అన్నారాయన.

''హారి పిడుగా! కొట్టవలసిన సమయం లోనే దెబ్బకొట్టావ్... ప్రాక్టికల్స్‌లో మాగ్జి మమ్ మార్క్స్ స్కోర్ చేస్తావులే'' స్టూడెంట్ నుద్దేశించి మనస్సులోనే అను కున్నాను.

కాటుకదిద్దిన నా కళ్ళల్లోకి జూస్తూ, ''ఆశా! నువ్వెంత అందంగా ఉన్నావో తెలుసా?'' అన్నారు పెళ్ళైన నాలుగు

## మందులు వాడితే
## మనశ్శాంతి ఉండదు!

కొన్ని రకాల మందులు అదేపనిగా వాడేవారికి మానసిక అశాంతి కలిగే ప్రమాదం ఉన్నదట కొన్ని రకాల మత్తుమందులు వాడటంవల్ల 'అకె తీషియా' అనే ఒక రకమైన మానసిక వ్యాధి రావచ్చునని 'అమెరికన్ జర్నల్ ఆఫ్ సైకియాట్రి' అనే పత్రిక వ్రాసింది. కుదురుగా ఒకచోట కూర్చోలేకపోవటం,ఆందోళన పడుతూ అటూ, ఇటూ తిరగటం, ఎప్పుడూ కాళ్ళు కదిలిస్తూ ఉండటం, కాళ్ళతో చప్పుడు చేస్తూ ఉండటం, వళ్ళు అర్ధం లేకుండా కదుపుతూ ఉండటం ఈ అకెతీషియా అనే అస్వస్థత లక్షణాలు.

నెలలకి పెళ్ళాం అందాన్ని గుర్తించిన ట్యూబ్ లైట్ మాష్టర్ని చూడగానే ఈసురో మన్నాను కాని ఎంతైనా నేనూ స్త్రీనేగా! ఆరడుగుల మనిషి, అందునా తాళిగట్టిన భర్త స్వయంగా అందాన్ని మెచ్చుకుంటుంటే ఏ స్త్రీ హృదయం పురివిప్పిన నెమలిలా నాట్యమాడదు? నా బుగ్గని తన పెదవులతో అద్దటానికి కాబోలు ముందుకు వంగిన శ్రీవారు ''నమస్కారం మాస్టారు'' అన్న మాట విని అదిరిపడి తిన్నగా కూర్చుంటూ నిర్జీవమైన నవ్వుని పెదవులపై పులుము కున్నారు. ఆరంగుళాలు పెరిగిన శ్రీవారి ఛాతి అకస్మాత్తుగా తొమ్మిదంగుళాలు తగ్గి పోయింది. బెడ్ రూంలో బుక్స్ ముందేసు క్కూర్చుని, ప్రయాణంలో ప్రణయం సాగించడానికి పూనుకున్న శ్రీవారి మీద కోపం వచ్చింది కాని పాల పిడతలా నల్లగా మాడిపోయిన ముఖాన్ని చూడగానే జాలేసింది. లేకుంటే ''మీ శిష్యులకి మీరంటే ఎంత భక్తండీ'' అంటూ ఏడ్పించేదాన్నే. ఎలా గైతేనేం థియేటర్ చేరుకున్నాం హిందీ పిక్చరయినా హౌస్‌ఫుల్ అయింది పిక్చరు ప్రారంభమయింది. ఆ చీకట్లో ఎవరూ చూడరాదని కాబోలు మా వారు పట్టు విడు వని విక్రమార్కుడిలా నా మీదకు వంగారు. కాని వెనకాయన ''మాష్టారూ'' అంటూ మెల్లగా భుజం తట్టి, ''దయచేసి కొంచెం ఎడంగా కూర్చుంటారా'' అన్నాడు పాపం మాష్టారు! హాలులో కూడా చుక్కెదు రయింది బాడ్ లక్

పిక్చరయిపోగానే టిఫిన్ చేద్దామని హోటల్ కెళ్ళాము అప్పుడుగాని జేవురించిన శ్రీవారి ముఖం నార్మల్ స్టేట్‌కి రాలేదు

''హల్లో సుమన్ బాబూ'' అన్న మాట లతో తలెత్తిన శ్రీవారు ఎదురుగా నిల్చున్న ప్రిన్సిపాల్‌గార్ని జూసి నోట మాటరాక అర్జం టుగా బట్టతల తడుముకోసాగారు.

''నీ తలనెప్పి ఎలాగుంది'' అని ప్రక్క నున్న నన్నుజూసి, ''ఓహో ఫ్యామిలీతో వచ్చావన్నమాట ఉంటాను మరి నాకు పనుంది'' అంటూ ముందుకు నడిచారాయన.

అప్పుడు గాని తలనొప్పని పర్మిషన్ తీసికొని వర్కు లేదని నా దగ్గర కోతలు కోశారన్న సంగతి బోధపడలేదు హతోస్మి!! సున్నం గొట్టిన గోడలా తెల్లమొహం వేసు కున్న శ్రీవారి వంక చూడలేక తల దించేసు కున్నాను.

ఆయన చేసింది వెధవపనే కావచ్చు. కాని ఆ పని కూడా నన్ను సంతోష పెట్టటానికీ చేశారనేది నిర్వివాదాంశం అందువల్ల డబుల్ గ్యాస్ సోడాలా ఆ వేళిటి నుంచి ఆయన యెడ నాకు ప్రేమ అధికమైంది అందుకే స్టూడెంట్స్ దగ్గర, ప్రిన్సిపాల్ దగ్గర ఆయనెక్కడ తేలికైపోతారోనని శ్రీవారితో కలిసి సినిమా కెళ్ళే ఆలోచనకు స్వస్తి చెప్పాను.

# క్రొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

## శుద్ధిచేసినది.
## వాసనలేనిది.

అమృతాంజన్ ఆముదము సాధారణంగా ఇండ్లలో వాడుకొనే మందులను తయారుచేసే సుప్రసిద్ధ అమృతాంజన్ కంపెనీ వారి మరో విశిష్ఠమైన ఉత్పత్తి.

**అమృతాంజన్ ఆముదము ఆరోగ్యవంతమైన కుటుంబాలకు.**









మూడు సైజులలో లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

OBM 3270 TG

# నిరుద్యోగి ఆత్మహత్య

సింగై అనే వూరుకు చెందిన 28 ఏళ్ల జ్ఞానరాజు అనే అతనికి పోయిన్నెల తూత్తుకుడి అనే వూరిలో వివాహమయ్యిందట పెళ్లయ్యాక జ్ఞానరాజు వోనెల్లాళ్లు తన మామగారింట్లో ఉండి ఆనక సింగై వచ్చాడట. ఆతని తండ్రి జపమణినాడార్ కొడుకు నిరుద్యోగితనాన్ని తీవ్రంగా విమర్శించి, అవమానంగా మాట్లాడి "పోయా తూత్తుకుడిలోనన్నా ఎవరి కాళ్లో పట్టుకుని వో ఉద్యోగం ఏడు" అన్నాడట దాంతో ఆ అవమానం భరించలేక మనస్సు విరిగిన జ్ఞానరాజు నల్లుల మందు త్రాగి ఆత్మహత్య చేసుకున్నాడట పాపం!! తలిదండ్రులకు తమ పిల్లలు, వారితోపాటు వాళ్ల ఆత్మ గౌరవం, అభిమానం ఎదుగుతున్నట్లు తెలీక ముద్దుగా వెధవా అనీ, అలాటివనీ మందలిస్తూంటారు! వైకాన్స్టెన్ లెరన్డి ట్రూత్ వెన్నవ్!

## కన్యాశుల్కం

ఇండోర్‌కు చెందిన బోర్కువా అనే గ్రామంలో అనాడియాభిల్ అనే వో కుర్రాడు భిల్లీ అనే వో యువతిని యధావిధి (ఆదివాసులు) పెళ్లిచేసుకున్నాడట పెళ్లయ్యాక అతను యివ్వాల్సిన కన్యాశుల్కం (వరకట్నం కాదు సార్) యివ్వలేదని పెళ్లికూతురు తండ్రి తన కూతుర్ని కాపురానికి పంపను పొమ్మన్నాడట. అనాడియాకు కోపం వచ్చి తిన్నగా పోలీసుల శరణు కోరితే రయమున వాంొచ్చి భిల్లీని విడిపించి ఫ్రీ ఆఫ్ కన్యాశుల్కం అతనికి ఒప్పగించారట.



## అఘాయిత్యం

తిరునల్వేలి చెంపకం రోడ్డులోని వో ఇంట్లో నివసిస్తున్న రామయ్యదేవర్ అనే ఆయన కూతురు 21 ఏళ్ల రాజమ్మకు మార్కెట్టులో కూరలు అమ్మే వో యువకునితో సంబంధం ఉన్నదట. ఈ విషయం పసిగట్టిన రామయ్యదేవర్ కూతుర్ని వారించడమే గాకుండా తన భార్య మీనాక్షిని కూడా తలవాచేలా చీవాట్లు వేశాడట భార్య మీనాక్షి కూతుర్ని వెనకేసుకు భర్తతో తీవ్రాతితీవ్రంగా పోట్లాడేసరికాధాటికి రామయ్యదేవర్ తట్టుకోలేక బయటికి వెళ్లిపోయాడట కోపం తిరగని మీనాక్షి నల్లులమందు తనింత తాగి, తన కూతురు రాజమ్మకూ కొంత పట్టించిందట. అది పనిచేసేలోగానే వారిద్దర్నీ పాలయంకోట్టై ఆసుపత్రిలో చేర్చి, వైద్య సహాయం అంది, గండం గడిచి బయటపడ్డాక మీనాక్షిమీద హత్య, ఆత్మహత్య నేరాలు పోలీసు మోపిందట పదుమరీ! మీనాక్షికి నలుగురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు ఉన్నారట.

## జీవిత రహస్యం

ఇరాన్‌లో అబ్బాస్ బాక్సార్ అనే ఒక శత వృద్ధుడు వున్నాడు. ఈయన వయస్సు 143 సంవత్సరాలు ఇంత వయోవృద్ధుడు ఇరాన్‌లో ఇంకెవరూ లేరట మీరు యింతకాలం బతకడానికి గల రహస్యమేమిటి అని పత్రికా విలేఖర్లు అడగ్గా ఎప్పుడూ ఎవరితో పోట్లాడవద్దు, ముఖ్యంగా భార్యతో అస్సలు పోట్లాడకూడదు అని చెప్పాట్ట. ఈ చిట్కా ఆయన తన జీవితాంతం పాటించాడట అందుచేతనే ఆయన 36 మంది భార్యలతో చక్కగా సంసారం చేశాడు.

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

**మితాక్షరాలలో అమిత ర్థాలను**
**సంధానించేవాడు బహూత్తమ కవి**
**అమితాక్షరాలలో పరిమితార్థాలను**
**నిక్షేపించేవాడు బహుధా కు కవి!**

## మహిళల పాదయాత్ర

హేమబిహారి, నిర్మల్‌బేటీ, లక్ష్మిపుకానే దేవిరాజ్‌వనీ అనే నలుగురు ఆడవారు పాదయాత్రతో పదహారు రాష్ట్రాలు తిరిగారట వీరు తిరిగినమొత్తం దూరం 20 వేల మైళ్ళట ఈమధ్యే వీరు నలుగురూ వార్ధాగంజ్‌కి చెందిన పౌనారి ఆశ్రమానికి, వెళ్లారట [illegible]యితే యీ 20 వేల మైళ్లు నడవడానికి యీ యాత్రకూ ఎంత కాలం పట్టిందో, ఎన్నిన్యాండర్లు మారాయో మాత్రం తెలియలేదు. మైండ్యు విమినార్నో యిన్స్పిరియర్డ్ మెన్!

## ఆవుతో చెలగాటం ...

కడప ప్రభుత్వ ఆసుపత్రి క్యాంటిన్‌లో సర్వరుగా పనిచేస్తున్న హమీద్ అనె వో ఉత్సాహవంతుడు నిద్రపోతున్న ఒక ఆవుతోకకు తన రెండు చేతులనూ చాలా కష్టపడి, కట్టుకుని ఆపైన ఏం జరుగుతుందో చూదామను కున్నాడట ఉషారుగా. ఈ హడావుడికి నిద్రలేచిన ఆవు తన శక్తి లోపం లేకుండా పరుగు ప్రారంభించిందట. అతను ఆవు తోకతోపాటు ఈడ్చుకుపోతున్న దృశ్యం చూసిన కొందరు ఆ ఆవు తోక తెగ్గొట్టి హమీదును రక్షిద్దామని చేసిన ప్రయత్నానికా ఆవు మరింత బెదరి, రోడ్డు మీద పోయే వో ఇద్దర్ని కుమ్మేసిందట ఆ ఫలితంగా బి డి ఒ. బాలయ్య అనే ఆయన మరణించారట హమీద్, రాయచోటి సబ్‌రిజిస్ట్రారు రామస్వామి ఆసుపత్రి పాలయ్యారట.



## తెలుగు కార్టూనిస్టుల తొలి ''సమ్మిట్''

జనవరి 11వ తారీఖున ఖమ్మం పట్టణంలో తెలుగు కార్టూనిస్టుల తొలి మహాసభ జరిగింది. వ్యంగ్య చిత్రకళ ఆవిర్భవించిన, అనేక సంవత్సరాలకు ఆంధ్రదేశంలోని సుప్రసిద్ధ వ్యంగ్య చిత్రకారులెందరో ఒకే వేదికపై సమావేశమయిన ఆ దృశ్యం కన్నుల పండువుగా వుంది దీనికి ఖమ్మం కళాపరిషత్తువారు వెన్నుతట్టి వెంట నిలబడడం ప్రశంసనీయం శ్రీ వీరాజీ ముఖ్య అతిథిగా హాజరై, ప్రారంభించిన ఈ మహాసభకు సోదర వాత్సల్యంతో ఒకే వేదికపై వున్న 70 మంది కార్టూనిస్టులే కాక, వేలాదిమంది వ్యంగ్య చిత్రాభిమానులు హాజరై సభను దిగ్విజయం చేశారు

శ్రీ వీరాజీ తన ప్రసంగంలో 'కార్టూనిస్టుకి సున్నితమైన హృదయం కావాలనీ, అతడు ఒక చిత్రకారునిగానేకాక, కవిగా, విమర్శకుడుగా సమాజ సమస్యలను కొంటెకోణంలో బొమ్మలనందించగలడని, ఈ నాడు మన ఆంధ్రదేశ పత్రికారంగంకూడా కార్టూన్లకు ప్రముఖ స్థానాన్నిస్తోందని, అపురూపమైన ఈ కార్టూనిస్టుల తొలి సమావేశం ప్రారంభించడానికి తాను గర్విస్తున్నా' మన్నారు

ప్రఖ్యాత సినీ దర్శకులు శ్రీ దాసరి నారాయణరావు, కార్టూనిస్టుల సావనీరును విడుదల చేశారు. ముఖ చిత్రంగా, ప్రఖ్యాత చిత్రకారుడు శ్రీ బాపూ సృష్టించిన గురజాడవారి గిరీశం, బుచ్చమ్మల వర్ణ వ్యంగ్య చిత్రాలంకరణతో లాస్యలావణ్య పూరితంగా వుంది ప్రముఖ వ్యంగ్య చిత్రకారులు సత్యమూర్తి, చంద్ర, రామకృష్ణబాబు, శంకుగార్ల పర్యవేక్షణలో వెలువడిన ఈ ప్రత్యేక సంచిక అనేకమంది వ్యంగ్య చిత్రకారుల చిత్రాలతోపాటు, ప్రముఖుల వ్యాసాలతో ప్రచురింపబడి, ప్రత్యేకతను సంతరించుకుంది. శ్రీ దాసరి తన ప్రసంగంలో ''ఇదివరలో మీరు (కార్టూనిస్టులు), మేము (సినిమా) రెండు కులాల వారమని, ఇప్పుడు విఖ్యాత చిత్రకారుడు శ్రీ బాపూ ద్వారా ఒకటైనామని'' అంటూ, సమావేశ నిర్వాహకుడు శ్రీ శంకును అభినందించారు. సభకు హాజరైన అనేకమంది కార్టూనిస్టుల పరిచయాల ప్రసంగాలనంతరం సభ దిగ్విజయంగా ముగిసింది. [ భరణి ఒక పరిశీలకుడు ]




**6-2-1976 శుక్రవారం మొదలు**
**12-2-1976 గురువారం వరకు**

మేషం — మీ కార్యక్రమాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి విలాస వస్తువులు కొంటారు

వృషభం — ఫలితం లేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వ్యతిరేకమైన వార్తలను వింటారు వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి మీ ప్రయత్నాలు ఫలిస్తాయి నూతన వ్యవహారాలు బాగుంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు

మిధునం — వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వారం మధ్యలో చికాకులకు గురి కాగలరు మీ తాలూకు వస్తువులు పోవచ్చును వారం ఆఖరులో కార్యక్రమాల్లో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

కర్కాటకం —స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది అధికవ్యయం జరుగుతుంది.

సింహం — అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు— వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

కన్య — మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలోకార్యభారం పెరుగుతుంది వారం మధ్యలో అన్ని వ్యవహారాలు బాగుంటాయి విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది అలంకార వస్తువులు కొంటారు

తుల — రావలసిన డబ్బు అందగలదు ప్రయాణాలు ఫలిస్తాయి. వారంమధ్యలో శ్రమకు గురికాగలరు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలులాభదాయకంగా ఉంటాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

వృశ్చికం — రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు వారం ఆఖరులో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

ధనుస్సు — వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వారం ఆఖరులో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి వినోదకార్యక్రమాల్లో పాల్గొంటారు.

మకరం — ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. వారం ఆఖరులో యితరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది పుణ్య కార్యాలు చేస్తారు.

కుంభం — మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. వ్యాపారంలో అనుకూలమైన వార్తలను వింటారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు — బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు

మీనం — మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి దైవ కార్యాలు నెరవేరతాయి.

# వెన్నెల కన్నెలు

(11 వ పేజీ తరువాయి)

జీవితాశయం. నలుగురివీ నాలుగు రకాల తత్వాలైనా నలుగురినీ కలిపింది మంచి మనస్సు, స్నేహపాత్రత

ధైర్యంగా ఉండే చంద్రకాంత ఉందనే ధైర్యంతో జ్యోత్స్న ఎమ్ ఏ లో చేరింది బి ఎ మంచిమార్కులతో పాసయిన పిల్లని ఊరికే ఇంట్లో ఉంచడం ఎందుకు, చదువుకుంటానని అన్నన్నాళ్లు చదివించి, మంచి సంబంధం చూసి పెళ్లి చెయ్యాలని,కుముదని వాళ్ల నాన్నగారే ప్రోత్సహించి ఎమ్ ఎ లో చేర్చారు

రిటైరైపోయి పెద్దకొడుకు ఉన్నచోట, స్వంత యింట్లో ఉండాలన్న కోరికతోశశికళ తండ్రి హైద్రాబాదులో సెటిలయ్యారు చిన్నతనంనించి శశికళ ఆరోగ్యం అంత మంచిది కాదు పైగా అందరికన్న చిన్నది తమ వెంటే ఉండాలని, ట్రాన్స్ఫర్ అయినప్పడల్లా తలిదండ్రులు ఊర్లు మార్చడంవల్ల చదువుకు అడ్డురావడంచేత ఆ పిల్లకి అందరిలాగా స్కూలుకివెళ్లి చదువుకునే అవకాశం లేకపోయింది చాలా చిన్నప్పుడు బడికి ఏ కొన్నాళ్లు వెళ్లిందో, తరువాత ప్రైవేటుగానే పరీక్షలన్నీ పాసవుతూ వచ్చింది ఇంక తండ్రి రిటైరై ఒకచోట సెటిలవటం, అదీ హైద్రాబాదు కావటంతో, ఎమ్ ఏ లోనైనా కాలేజీలోచేరి, స్నేహితులతో కలిసి చదువుకోవాలనే కోరిక ఆ అమ్మాయికి తీరింది. శశికళ సృష్టిలోఉన్న చాలా కష్టాలన్నీ దాటింది అసలు పన్నెండేళ్లు వెళ్లేదాకా పిల్ల బతుకుతుందనే ధైర్యం ఎవరికీ ఉండేది కాదని వాళ్లవాళ్లే అనుకుంటూ ఉంటారు పెద్దయినకొద్దీ చెప్పుకోదగ్గ ఆరోగ్యం ఏమీ లేకపోయినా, ఎక్కువ కష్టపడలేక పోవటం ఏ మాత్రం తిరిగినా అలసిపోవటం, ఆ అమ్మాయి, ఆ వయసు పిల్లలున్నంత ఉత్సాహంగా ఉండలేకపోవటానికి కారణం

"నువ్వు యూనివర్సిటీలో చేరితే, రోజూ వెళ్లి వచ్చేటప్పటికే నీకు అలసటవుతుంది ఇంకేం చదువుతావు" అన్న పెద్దవాళ్ల మాటకి ఒకటే సమాధానం చెప్పింది

"ఎప్పుడు చదవలేననుకుంటే అప్పుడే మానేస్తాను నాకు చేరాలని ఉంది" అని.

ఒకసారి శశికళ నిర్ణయం బయటకు వచ్చాక దాన్ని మార్చటం ఎవరికీ సాధ్యం కాదని ఇంట్లో అందరికీ తెలుసు. అందుకే "దానిష్టం" అని అంతా సరిపెట్టుకున్నారు "కారులో వెళ్లను అందరిలాగా బస్‌లో వెడతానని" కూడా చిన్న పేచీ పెట్టబోయింది కాని అందుకు మాత్రం ఎవరూ ఒప్పుకోలేదు యూనివర్సిటీలో చేరి చదువుకుంటున్నానన్న ఉత్సాహంలో, ఈ విషయంలో బుద్ధిగా పెద్దవాళ్ల మాట వింది

శశికళ మంచి స్నేహితురాలనే కాకుండా ఆ అమ్మాయికి వెధవ డబ్బు కోసం తడుముకోవలసిన అవసరం లేదనే ఆకర్షణ కూడా ఉంది చంద్రకాంతకి అది ఒక్కొక్కసారి అనుకోకుండా బయటపడిపోవడం, డబ్బువల్ల ప్రత్యేకంగా ఉండటం ఇష్టంలేని శశికళ నొచ్చుకోవడం, కుముద ఇద్దరినీ సమాధానపరచడం కూడా జరుగుతూ ఉండటం కద్దు. అయినా ఇటువంటి చిన్న చిన్న విషయాలు వాళ్ల స్నేహానికి అడ్డురాలేదు కలిసి చదువుకున్నా, లైబ్రరీ పుస్తకాలు పంచుకున్నా, నోట్సు రాసుకుని ఒకళ్లకి ఒకళ్లు ఇచ్చుకున్నా ఎలాంటి అరమరికలు లేకుండా హాయిగానే రెండేళ్లు గడిపారు. మీరుతో మొదలైన పరిచయం నువ్వులో స్థిరపడి, లది, ఇది అనుకునేటంత గట్టిదైపోయింది

నలుగురిపేర్లు తమాషాగా చంద్రుడితో సంబంధం ఉన్నవి కావడంతో వీళ్లని ఎప్పుడో, ఎవరో "వెన్నెల కన్నెలు" అన్నారు ఆ పేరు యూనివర్సిటీలో మోగిపోయింది నలుగురూ కలిసి ఏ లైబ్రరీకో, ఇంకెక్కడికో వెడుతున్నప్పుడు ఎవడో వెనకనించి "వెన్నెల కన్నెలురోయ్" అనక మానడు జ్యోత్స్న బెదరకా మానదు కుముద మాత్రం "నన్ను చూస్తే వెన్నెల అన్నపదంకూడా గుర్తురాదే నేనెలా వెన్నెలకన్నెనే" అంటూ ఉండేది

"మావి ఉత్తిపేర్లే నువ్వే అసలు వెన్నెల, కన్నెవి నీపక్కనుంటే వెన్నెల్లో ఉన్నంత సరదాగా, హాయిగా ఉంటుంది" చంద్రకాంత సమాధానం చెప్పేది.

ఇల్లు, యూనివర్సిటీ, లైబ్రరీ, పుస్తకాలు, అప్పుడప్పుడు సినిమాలు, ఎప్పుడూ కబుర్లు తప్ప ఇంకో లోకం ఉందని గుర్తులేకుండా నలుగురూ గడిపారు. ఫైనల్ పరీక్షలకి రాత్రింబవళ్లు చదివి, పీక్కుపోయిన మొహాలతో, గుంటలుపడ్డ కళ్లతో, రెండేళ్లు పూర్తి అయాయని నిరూపించారు ఆఖరి

క్ష అయాక తరువాతేం చెయ్యాలన్న
ోచన వచ్చింది అసలు "తరువాత" అనే
శ్న వస్తుందని అప్పుడే అందరికీ తట్టింది
"నేను ఉద్యోగం చేస్తాను. పి హెచ్ డి
్తాను" చంద్రకాంత అడక్కుండానే
్పింది

"నేను పి హెచ్ డి చేసేటంత శ్రమపడ
లేను మా అత్తయ్యకి ఒక స్కూలు ఉంది
అందులో పిల్లలకి పాఠం చెప్పమని ఎప్పుడో
అడిగింది. చెప్పగలనేమో చూస్తాను" శశికళ
ఇంకా పూర్తిచెయ్యకముందే ఇంతెత్తున ఎగి
రింది చంద్రకాంత.

"ప్రైమరీ పిల్లలకి పాఠాలు చెప్పడానికి
ఎమ్ ఏ చదవాలా ? బి యిడి. చెయ్యాక
పోయావా, అయినా నీకంతకన్నా మంచి
ఉద్యోగం కనబడలేదా" అని [ఇంకావుంది]

# మీ తల్లి ఇచ్చిన సలహాను నమ్మండి




మీ పాప పుట్టినపుడు,
మీ అమ్మమ్మ చెప్పినట్లుగానే,
**వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్**
వాడమని చెప్తుంది.

**100** ఏళ్లుగా మాతృలోకం విశ్వసించినది



**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**




డిస్ట్రిబ్యూటర్లు : మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రైవేట్) లిమిటెడ్, విజయవాడ—520001. మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్, (ప్రైవేట్) లిమిటెడ్, మద్రాసు—600001. మధుర సౌత్ ఇండియా కార్పొరేషన్ (ప్రైవేట్) లిమిటెడ్, 7—3—710 రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు—500003.

రిటైల్ షో రూమ్స్ : చెట్టినాడ్ ఏజన్సీస్, 40, మవుంట్ రోడ్డు, మద్రాసు—600006. మధుర ఫాబ్రిక్స్ రిటైల్ షాప్, 7—6—624 రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాద్—500003.

కృష్ణ సమర్పించు  పద్మాలయా ఆర్ట్ పిక్చర్స్

# పాడిపంటలు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: జి. ఆదిశేషగిరిరావు B.Sc. కథ–దర్శకత్వం: పి. చంద్రశేఖరరెడ్డి B.A. స్క్రీన్‌ప్లే: జి. హనుమంతరావు

మాటలు: త్రిపురనేని మహారధి సంగీతం: కె. వి. మహదేవన్ ఫొటోగ్రఫీ: పుష్పాలగోపీకృష్ణ S.I.C.A. కూర్పు: కోటగిరి గోపాలరావు

ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్: యు. సూర్యనారాయణబాబు

ఆంధ్ర: తారకరామ ఫిలింస్ సీడెడ్: నవభారత్ ఫిలింస్ నైజాం: శ్రీతారకరామా ఫిలింస్ మైసూరు: ఎస్. వై. కె. కంబైన్స్